30.9.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 66, సంచిక: 38, విడిప్రతి : రు.2.00లు

Phone : 27354 Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# ముఖ్యమంత్రికి చెంపదెబ్బ!

పిసిసి అధ్యక్షుడుగా శ్రీ కమాలుద్దీన్ అహమ్మద్‌ను నియమించి ముఖ్యమంత్రి చెంప మీద ఫెడేల్‌మని కొట్టారు ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు. ముఖ్యమంత్రి వూహించని దెబ్బ ఇది. కమాలుద్దీన్ తామరాకు మీద నీటి బొట్టు వంటి వాడు. ఎవరికీ విహితుడు కాదు, ఎవరికీ విరోధి కాదు. రాష్ట్రంలోని ఏ వర్గంతోనూ ఆయనకు సంబంధం లేదు. ఏ నాయకుడితోనూ నిమిత్తం లేదు. ఎప్పుడూ రాష్ట్ర రాజకీయాలలో తల కాదు కదా, చిటికెన వేలు కూడా దూర్చలేదు. ఆయనకు తెలిసిన రాజకీయం ఒక్కటే- పివిని అనుసరించడం; ఆయన నమ్మిన నాయకు డొక్కడే - పివి నరసింహా రావు; ఆయన భూత, భవిష్యత్, వర్తమాన కార్యక్రమమూ ఒక్కటే - పివి చెప్పింది వినడం, చేయడం. ఇద్దరిదీ ఒకే జిల్లా; ఇద్దరూ మంచి స్నేహితులు; అర్ధరాత్రి అవసరం పడినా నేరుగా పివి గదిలోకి తలుపు తీసుక వెళ్లి మాట్లాడ గాగల అతి కొద్ది మంది అంతరంగికులలో కమాలుద్దీన్ ఒకరు. పివి వలె ఆయనా నిజాయితీ పరుడు. పివి వలె ఆయనా మృదు భాషి. మితభాషి. కేంద్రంలో అత్యంత కీలకమైన వాణిజ్య శాఖను నిర్వహిస్తున్నా ఎప్పుడూ ఒక్క వివాదంలో కూడా ఆయన పేరు బయటకు రాలేదంటేనే - కమాలుద్దీన్ వ్యక్తిత్వం అర్థం చేసుకోవచ్చు.




## బ్యాడ్‌లక్!

ఎన్నికల కమీషన్ ఉత్తర్వులను కలెక్టర్ గారు ఖచ్చితంగా అమలు చేయడం వల్ల బహిరంగ సభ తప్ప జగదీశ్ టైట్లర్ నెల్లూరు, ఉదయగిరిలలో పాల్గొనే సభలన్నీ రద్దయి పోయాయి. అంత ఖర్చు ఆర్భాటం వృధా కావడం మాగుంట సుబ్బరామ రెడ్డి గారి దురదృష్టం!



అటువంటి స్నేహితుడ్ని హఠాత్తుగా రంగంలోకి దింపి రాష్ట్ర నాయకులందరినీ బిత్తర పెట్టారు ప్రధాని. ముఖ్యమంత్రే కాదు - ఎవరూ వూహించ లేదీ పేరు. కాపులు లేదా ఇతర వెనుకబడిన తరగతుల నుంచి ఎంపిక చేస్తారని అందరూ భావించారు. ముఖ్యమంత్రి తన మనుషులుగా సింగం బసవ పున్నయ్య, కెవి కేశవరావులను ప్రతిపాదించాడు. ఎన్నికల సమయంలో తనకు అనుకూలుడైన పిసిసి అధ్యక్షుడు వుండడం అవసరమని, ఆయన ఎంతో

కొరవ 7 పేజీలో




# పివి తనయుల ప్రాభవం పెరిగింది!

తెలుగు దేశం పార్టీలో కోల్డ్‌వార్ కొన సాగుతుండగా అధికార పక్షమైన కాంగ్రెస్‌లో 'బాహాబాహీ' పరిస్థితి నెలకొంది. ముఖ్యమంత్రి కోట్ల కిడప టైగర్ వై.ఎస్., మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి, మాజీ పిసిసి అధ్యక్షుడు హనుమంత రావు. వీరు గాకుండా ప్రధాని పి.వి. మద్దతు దారులు ఎవరికి వారుగా తమ తమ

**ఆశచూపడం తప్ప తాయిలం చేతికి ఇవ్వడం లేడు పివి**

మార్గాల్లో తమ విధేయులకు టిక్కెట్ల కోసం ప్రయత్నిస్తున్నారు. ముఖ్య మంత్రి మురా రాజకీయం చలవ వల్ల ఇప్పుడు ప్రతీ జిల్లాలో కూడా కాంగ్రెస్‌లో వేర్వేరు కుంపట్లు ప్రారంభ మయ్యాయి. కాంగి సిట్టింగ్ ఎమ్మెల్యేలు చాలా మందితో ముఖ్య మంత్రికి సన్నిహిత సంబంధాలు లేవు. 74 ఏళ్ల ముఖ్యమంత్రికి తన కంటే వయసులో చాలా చిన్నవారైన ఎమ్మెల్యేలంటే చిన్నచూపు అందుకే తన సమకాలికులు, అరవై ప్లస్ వయస్సులో వున్న పాత కాపుల్ని రంగంలోకి దింపాలని ప్రయత్నిస్తున్నారు. దాదాపు రెండు దశాబ్దాలుగా రాజకీయాలకు దూరమై ఊరగొట్టిన నాగేళ్లుగా వున్న వారందరికీ తిరిగి ఎన్నికల మేకప వేయటం కుర్రకారు తరానికి ఏ మాత్రం నచ్చటం లేదు. కుర్రకారు వర్గాన్ని వై.ఎస్. రాజశేఖర రెడ్డి వెనకేసుకొస్తున్నాడు. మధ్యే మార్గంగా వున్న వారు నేదురుమల్లినో, హనుమంత రావునో, పి.వి. వర్గాన్నో అనుసరిస్తున్నారు. ఎవరి జాబితా వారు రూపొందించు కుంటున్నారు. అభ్యర్థుల బలాబలాలు, విజయా వకాశంతో నిమిత్తం లేకుండా ఆశ్రితుల కోసం ప్రయత్నాలు ప్రారంభించారు. అయితే అధిష్టాన దేవుడు మాత్రం అన్ని వర్గాలకు తాయిలం ఆశ పెట్టి తాను చేయాలనుకున్న పని తాను చేసుకు పోతున్నాడు. టిక్కెట్ల పంపకంలో ముఖ్యమంత్రి పాత్రను దాదాపు తగ్గించేశాడు. టిక్కెట్ల దరఖాస్తుల్ని తీసుకొని, వాటిని విశ్లేషించే పనిని తన కొడుకు పి.వి. రాజేశ్వర రావుకు అప్పజెప్పాడు. టిక్కెట్ల కోసం దరఖాస్తు చేసే వారంతా ఇప్పుడు విధిగా రాజేశ్వర రావును కలిసి తమ వంతు ప్రయత్నాలు చేస్తున్నారు. టిక్కెట్ల పంపిణీ తంతు అంతా పి.వి. తోనే ముడి పడి వుందన్న విషయం తేలి పోవడంతో పి.వి. కుటుంబ సభ్యుల ప్రాధాన్యత పెరిగింది.

### అభ్యర్థులకు లక్ష్మీపార్వతి ఆర్థిక పరీక్ష

# సిట్టింగ్ ఎమ్మెల్యేలకు ఎసరు పెట్టేట్లున్నారు!

ఎన్నికలు సమీపిస్తున్న కొద్దీ రాష్ట్రంలో ప్రధాన ప్రతిపక్షాలైన కాంగ్రెస్, తెలుగు దేశం పార్టీల్లో అనిశ్చిత పరిస్థితి నెలకొంటోంది. అధికారికంగా ఆయా పార్టీలు టిక్కెట్లు కేటాయించే వరకు ఎవరు ఎక్కడ పోటీ చేస్తారన్నది సందేహా స్పదంగా వుంది. ముఖ్యంగా సిట్టింగ్ ఎమ్మెల్యేల్లో ఈ రకమైన ఊగిసలాట ఎక్కువగా కన్పిస్తోంది. తెలుగు దేశం పార్టీలోని 74 మంది ఎమ్మెల్యేల్లో అయిదారు గురికి మినహా మిగతా వారందరికీ తిరిగి టిక్కెట్లు ఇస్తామని గతంలో ఎన్టీఆర్ ప్రకటించినప్పటికీ ఇటీవలి నుంచి ఆయన ధోరణి చూస్తుంటే 'సిట్టింగ్' ఎమ్మెల్యేలు' చాలా మందికి 'ఎసరు' పెట్టే అవకాశాలు కన్పిస్తున్నాయి. దేశంలో అల్లుళ్ల ప్రాభవం తగ్గి అత్త పెత్తనం పెరగటంతో ఈసారి కొత్త ముఖాలు ఎక్కువగా కన్పించ వచ్చు. సిట్టింగ్ ఎమ్మెల్యేల్లో మెజారిటీ బాబుకో దగ్గుబాటికో సన్నిహితులు కావడంతో ఎన్టీఆర్ కూడా పునరాలోచనలో పడ్డారు. పార్టీలో ఇటీవల నెలకొన్న అల్లుళ్ల సంక్షోభం నుంచి బయట పడటానికి, అందర్నీ కలుపుక పోతానని ఎన్టీఆర్ బయటకు చెబుతున్నా నా మాటే వేదం, నే చెప్పిందే మ్యానిఫెస్టో అంటూ తిరిగి తన సొంత స్టైల్‌కు వెళ్తున్నాడు. వివిధ జిల్లాల నుంచి టిక్కెట్టు ఆశించే వారిని 'ఆర్థిక అంగబలాల' ప్రదర్శనకు పురమా యిస్తున్నాడు. ఒకే నియోజక వర్గం నుంచి నలుగురైదుగురు అభ్యర్థులు టిక్కెట్టు కోసం పోటీ పడ్తున్నా ఎన్టీఆర్ స్వయంగా వారిని ప్రోత్సహిస్తున్నాడు. అల్లుళ్లకు మామ వైఖరి నచ్చటం లేదు. ఒకే నియోజక వర్గం నుంచి ఇలా నలుగురైదుగుర్ని ప్రోత్సహించడం వల్ల ఎన్నికల్లో టిక్కెట్టు రానివారు తీవ్ర ఆశాభంగానికి లోనై పార్టీని విడిచి వెళ్తారని అల్లుళ్లు మొత్తుకుంటున్నారు. అయితే లక్ష్మీపార్వతి కూడా ఎన్టీఆర్ వైఖరిని సమర్థిస్తూ అభ్యర్థులు 'ఆర్థిక పరీక్షలో' ఉత్తీర్ణులు కావాలన్న

**టిక్కెట్లకే నోట్ల కట్టలతో చితక బాదితే ఎన్నికల్లో నెగ్గేదెట్లా అని అల్లుళ్ల గోల!**

నిబంధన పెడ్తోంది. టిక్కెట్టుకు ముందు 'అడ్వాన్సు' అందరూ ఇచ్చుకుంటున్నారు. టిక్కెట్టు సమయంలో వేలం పాటలో ఎవరు ఎక్కువ పెట్టి పాడితే వారికే టిక్కెట్టు



నెల్లూరు పోస్టాఫీసులో అకౌంట్స్ అధికారి నెల్లూరు రామయ్య నాయుడు కుమారుడు [illegible] : వీరి వివాహం ఇటీవల నెల్లూరులో జరిగింది.

దక్కుతుందట. ఎన్నికలకు ముందే అభ్యర్థుల్ని ఇలా నోట్ల కట్టలతో చితక బాదడం వల్ల రేపు ఎన్నికల సమయంలో అభ్యర్థులు ఎలా నెగ్గుక వస్తారో తెలీటం లేదని అల్లుళ్లు అంటున్నారు. మొత్తం మీద 'దేశం'లో ఎవరికి టిక్కెట్టు వస్తుందన్నది 'లక్ష్మీ ప్రసన్నం' మీదనే ఆధార పడి వుంది. ఇలా వుండగా దేశం అధి నాయకుడు ఈసారి నియోజక వర్గాల్ని మార్చాలని యోచిస్తున్నాడు. ప్రస్తుతం ప్రాతినిధ్యం వహిస్తున్న హిందూపూర్ కాకుండా ఈ మారు గుడివాడకు వెళ్లాలని అనుకుం టున్నాడట. ప్రస్తుతం గుడివాడకు ఈశ్వరకుమార్ ప్రాతినిధ్యం వహిస్తున్నారు. రాయలసీమ పరిస్థితి అంతంత మాత్రంగా వుండటం, ఎమ్మెల్యే అయ్యాక హిందూపూర్‌ను నిర్లక్ష్యం చేయటంతో అక్కడ అన్న పట్టు బాగా సడలింది. కాగా పెద్దల్లుడు, ఎంపీ అయిన డాక్టర్ దగ్గుపాటి ఈసారి పరూచూరు అసెంబ్లీ స్థానానికి పోటీ చేయాలని వువ్విళ్లూరు తున్నారు. చిన్నల్లుడు బాబు మాత్రం తిరిగి కుప్పం నుంచి పోటీ చేస్తాడట. అల్లుళ్లిద్దరూ ఎన్నికల యుద్ధానికి సదుం బిగుస్తుండగా లక్ష్మీపార్వతి కూడా, తెనాలి నుంచే, వినుకొండ నుంచే పోటీ చేయాలన్న నిర్ణయాన్ని బహిరంగంగా చెప్పకపోయినా

# ముహూర్త నిర్ణయం

రాష్ట్ర శాసన సభ ఎన్నికలకు ముహూర్తం నిర్ణయిం చేశారు చీఫ్ ఎలక్షన్ కమీషనర్ శ్రీ టిఎన్ శేషన్ - నవంబర్ 1 తేది నోటిఫికేషన్ వెలువడుతుంది. 8 తేది వరకు నామినేషన్లు స్వీకరిస్తారు. 11 తేది ఉప సంహరణలకు తుది గడువు. డిసెంబరు 1, 5 తేదులలో పోలింగ్ జరుగుతుంది. ఓట్ల లెక్కింపు 9 తేది.

ఆంధ్రప్రదేశ్‌తోపాటు కర్ణాటకకు నవంబరు 26, డిసెంబరు 1 తేదులలో; గోవా, సిక్కిం రాష్ట్రాలకు నవంబరు 16 తేది పోలింగు జరుగుతుంది. అన్ని రాష్ట్రాల ఓట్ల లెక్కింపు ఒకటే రోజు జరుగుతుంది. ఫలితాలు ఒకేసారి వెలువడుతాయి. ఈ నాలుగు రాష్ట్రాలూ కాంగ్రెస్ ప్రభుత్వాల పాలనలో వున్నవే కావడం గమనార్హం. డిసెంబరు 14 తేది లోగా వీటన్నింటిలో కొత్త ప్రభుత్వా లేర్పడుతాయి.

పోలింగ్‌లో, ఓట్ల లెక్కింపులో ఇంతింత వ్యవధి పెట్టడం అసాధారణం. పోలింగ్ రెండు విడతలుగా జరిగినా కౌంటింగ్ వెంటనే జరిగి పోవడం అలవాటు. కాని ఎన్నికలను వీలైనంత ప్రజాస్వామ్య యుతంగా, అనర్థాలకు తావు లేకుండా జరిపించడానికి శేషన్ ఈ మార్గం అనుసరించారు. ఒకేసారి అన్ని నియోజక వర్గాలలో పోలింగ్ నిర్వహిస్తే, బూత్‌ల ఆక్రమణ, రిగ్గింగు వంటి దౌర్జన్యాలను అరికట్టడానికి తగినంత పోలీసు సిబ్బంది లభించదనే ఉద్దేశ్యంతోనే రెండు తేదీల నడుమ 3 రోజుల వ్యవధి వుంచారు. దీనివల్ల పోలింగ్ పూర్తయిన నియోజక వర్గాల నుంచి పోలీసులను నింపాదిగా తరలించ వచ్చు. ఉన్న సిబ్బందిని సమర్థ వంతంగా వినియోగించు కోవచ్చు. ఎక్కడైనా రీపోలింగ్ అవసరమైతే అందుకు తగిన ఏర్పాట్ల కోసం పోలింగ్‌కు, లెక్కింపుకు మధ్య కూడా 3 రోజుల వ్యవధి వుంచారు. ఎన్నికలు జరిగి పోయిన తర్వాత అంత సుదీర్ఘ కాలం ఫలితాల కోసం వేచి వుండ వలసి రావడం అభ్యర్థులకు, కార్యకర్తలకు కూడా దుస్సహమే. నరాలు చిట్లే టెన్షన్‌తో నిద్రలేని రాత్రులు గడప వలసి వుంటుంది. 1 తేది పోలింగ్ జరిగిన కేంద్రాలలోని వారు 7 రోజులు ఎదురు చూడాలి కదా? రాజకీయ పార్టీలను అన్ని రూపాలా రాచి రంపాన పెట్టేస్తున్నాడు శేషన్.

ఎన్నికలతేదీలు ప్రకటించినా రాష్ట్రంలో, ముఖ్యంగా ప్రజలలో ఎందువల్లనో ఎన్నికల వాతావరణం కన్పడడం లేదు. దీని పై పెద్దగా చర్చలు, వివాదాలు తలెత్తడం లేదు. ఎన్నికల పట్ల ప్రజలలో పెరుగుతున్న నిరాసక్త తను ఇది సూచిస్తున్నది. ఒక రకంగా దీన్ని రాజకీయ పరిణతిగా కూడా భావించ వచ్చునేమో! రాజకీయ పార్టీలు మాత్రం ఉడుకెక్కి పోయి వున్నాయి. కాంగ్రెస్ తెలుగు దేశంల మధ్య నడుస్తున్న పత్రికా ప్రకటనల యుద్ధం- దిగజారి పోయిన సభ్యతా, సంస్కార విలు వలను సూచిస్తున్నది. ఎన్టీ రామారావు గారు మరీ అసహ్యమైన పదజాలాన్ని వాడేస్తున్నాడు. విమర్శించడం మాని కుక్కలు, పందులు అనే తిట్ల దండకంతో ప్రచారానికి సన్నద్ధ మౌతున్నాడు. ఇవి ఎటువంటి ఉద్రిక్తతలకు దారి తీస్తాయో, ప్రజలు వాటిని ఏ రూపంలో స్వీకరిస్తారో చూడాలి మరి!

పోలింగ్‌కు వ్యవధి ఇవ్వడం వల్ల పాలక పార్టీ తన గూండాలను, అరాజక శక్తులను తరలించి విధ్వంసానికి పాల్పడే వీలు కల్గుతుందని తెలుగు దేశం చేస్తున్న విమర్శ అర్థ రహిత మైనది. ఇటువంటి శక్తులు ఉభయ పార్టీలకూ సరి సమానంగా వున్నాయి. కేవలం దౌర్జన్యాలతో ఏ పార్టీ కూడా ఎన్నికల్లో గెలవ గలదను కోవడం హాస్యాస్పదం. అదే నిజమైతే ఒకసారి అధికారంలోకి వచ్చిన పార్టీ తిరిగి ఏ ఎన్నికలలోనూ ఓడి పోయే పరిస్థితి ఏర్పడదు కదా? రిగ్గింగ్‌ల వంటి వాటివల్ల కొన్ని నియోజక వర్గాలలో ఫలితాలు తారు మారయ్యే ప్రమాదం వుంది కాని, ఆ సంఘటనలు రాష్ట్రం మొత్తం మీద ప్రజాభిప్రాయాన్ని తారు మారు చేయలేవు. ప్రజలు కోరిన పార్టీయే అధికారంలోకి రావడం మనం ఎన్నో ఎన్నికలలో ప్రత్యక్షంగా చూశాం. ప్రజల [illegible] బలం ముందు ఎవరి ఏ బలాలూ నిల్వలేవు.

అందులోనూ పై నుండేది శేషన్. పాపులను గుర్తించడంలో యమ ధర్మరాజైనా యేమరుపాటుగా [illegible] ఎన్నికల తప్పిదాలు కనిపెట్టడంలో శేష[illegible] రెప్ప లార్పరు. ఈ [illegible] వాస్తవాన్ని గుర్తెరిగి [illegible] రాజకీయ పార్టీలు రానున్న ఎన్నికలలో ప్రజాస్వామ్య యుతంగా వ్యవహరించడం మంచిది. డబ్బు పందారం, అధికార దుర్వినియోగాలకు దూరంగా వుండి; రిగ్గింగు దౌర్జన్యాలు కట్టిపెట్టి స్వేచ్ఛాయుత వాతావరణంలో ఓటర్లు తమ అభిమతాన్ని వ్యక్తం చేసే పరిస్థితిని కల్పించడంలో రాజకీయ పార్టీలు స్వచ్ఛందంగా ఎన్నికల కమిషన్‌కు సహకరించడం మంచిది.

సుప్రీం కోర్టు తీర్పు ప్రకారం నోటిఫికేషన్ వెలువడే వరకు తనకు స్వేచ్ఛ వున్నా, ఎన్నికల ప్రవర్తనా నియమావళిని తక్షణం పాటిస్తామని ప్రకటించి ముఖ్యమంత్రి శ్రీకోట్ల విజయభాస్కర రెడ్డి ఆదర్శంగా వ్యవహరించారు. అధికారుల బదలీలు, కొత్త పథకాల ప్రకటనలు నిలిపి వేయడంతో పాటు ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనా కార్యక్రమాలనూ రద్దు చేస్తున్నట్లు చెప్పారాయన. ఎంతో అభినందించ దగిన నిర్ణయమిది. ఆఖరి రోజులలో పలు రకాల ఆశలు కల్పించి ప్రజలను మభ్య పెట్టి, ఎన్నికలను ప్రభావితం చేయడం ధర్మసమ్మతం కాదు. అందుకు ప్రభుత్వా[illegible] నాలుగు మున్నాతిక సంవత్సరా[illegible] సమయం వుండింది. అన్ని [illegible]జుల్లో ఏమీ [illegible]యలేని వా[illegible] ఈ మూడు నె[illegible] చేయ గల్గింది ఏమి వుంది?

శేషన్ సైతం తప్పు లెన్నడమే తన తత్వంగా వ్యవహరించ కుండా, [illegible] పోని వివాదాలు సృష్టించి ఉ[illegible]క్రతలు పెంచకుండా వాస్తవ పరిస్థితులను అర్థం చేసుకొని ఎన్నికలను నిర్వహించాలి. ప్రజాస్వామ్యాన్ని కాపాడే నెపంతో ఆయన నిరంకుశంగా వ్యవహరించడం తగదు. రాష్ట్ర చరిత్రలో కీలకమైన ఈ ఎన్నికలు శాంతియుతంగా, స్వేచ్ఛాయుతంగా జరిగి పోతాయని ఆశిద్దాం!

జమీన్‌రైతు

29 -9 - 1944

పేజీలు : 4 వెల : 0-1-6

## తిక్కవరపు రామరెడ్డిగారి 50వేల విరాళం.

నెల్లూరు రెడ్డి ప్రముఖులును, సారస్వత ప్రియులును, వదాన్య శేఖరులునగు శ్రీ తిక్కవరపు రామరెడ్డిగారు శ్రీ కస్తూరిబా స్మారక నిధికి 50 వేల రూపాయలు విరాళమొసగుచు, ఈ మొత్తమును నెల్లూరులోని శ్రీ కస్తూరిదేవి బాలికాహైస్కూలుకు ప్రత్యేకించిరి.

## ఆంధ్రా రబ్బరుతోట

కర్నూలుకు 28 మైళ్ల దూరంలోనుండు [illegible]న్నూరు గ్రామ సమీపము[illegible] ప్రభుత్వమువారి రబ్బరు తోటను [illegible]ల్లాకల్లెరు తెరిచారుట. చెట్లనుంచి పాలుదీసిన తర్వాత రబ్బరు చేయు పద్ధతి లాభమువేదనియు, చెట్లట్టను కోసి వదలివేసిన మరురోజుకు అది గడ్డగట్టుననియు, అది పౌ 1కి రు4ల క్రయము జరుగుననియు, టి.వి. రెడ్డిగారు చెప్పిరి.

## నెల్లూరు ముచ్చట్లు

గ్రేండ్సువారి 26 తేగి తులాభారం అగ్ర పీఠాన్న బంకరించింది [illegible] సత్య:- ఆమె లక్ష్మీకాంతమేగాదు. కమలనయనం గూడ. కళ బాగా వికసించింది. ఇంకా సానబడితే ధర పెరుగుతుంది.

కృష్ణ:- చెన్నూరు అరితేరిన చెయ్యి. అయితే సంగీతాన్ని తగ్గు స్థాయికి దింపమనీ, ఉత్తరాది అనుకరణ తగ్గించమనీ ప్రార్థన.

నారద:- వీరిని గూడా ఆ ఉత్తరాది సంగీతం తగ్గించమనే దానికంటే కోరదగిందేమీ అంతగా కనిపించలేదు.

**50 ఏళ్లక్రితం ఈవారం**

ఇక తక్కిన అన్ని పాత్రలు గూడా చక్కగా నిర్వహించబడినవి.

* * *

'హాలిక' మరుపూరు కోందడ రామరెడ్డి గారనువదించిన "హిందూపద్ పాద్‌షాహి" పఠనోత్సవం గూడా 23తేది జరిగింది. రచన 'స్వచ్ఛంద బల పదుజ్వల వీర్యవంతంగా' ఉన్నదంటారు రసజ్ఞులు. హిందు మహమ్మదీయ ఘర్షణ సందర్భంలో పోలీసు తుపాకికి ప్రాణాన్నర్పించిన నరసమ్మ స్మరణ చిహ్నంగా వ్యాయామ పోటీలో గెలుపొందినవారికి ఏటా రు15/- లు బహూకరణమిస్తానన్నారట మైలవరం యువరాజాగారు.

* * *

# మద్య నిషేధానికి ముందు గతానుభవాలు గమనించండి!

1950 లో రాష్ట్ర ప్రభుత్వం మద్య నిషేధ చట్టం అమలు జరిపింది. కాని ఆనాడు చట్టం సరిగా అమలు జరగడం లేదనీ, ప్రభుత్వ యంత్రాంగంలో అవినీతి పెరిగిందనీ, ప్రభుత్వానికి కోట్ల రూపాయల నష్టం వస్తున్నదనీ చట్టాన్ని ఎత్తి వేయాలని ప్రతిపక్ష పార్టీలు గగ్గోలు చేశాయి. నిజానికి ఆనాటి, ఈనాటి పరిస్థితులలో పెద్ద మార్పేమీ లేదు. అధికారుల్లో అవినీతి తొలగక పోగా ప్రజల్లో త్రాగుడు వ్యసనం అధికమైంది. విద్యార్థులు సైతం తాగి తందనా లాడుతున్నారు. దీనివల్ల దేశంలో దారుణమైన విష పరిణామాలు చవి చూస్తున్నారు.

దీన్ని అధిగ మించడానికి అందుబాటులో వున్న అన్ని ప్రచార సాధనాలనూ వుపయోగించి ప్రజల్లో మార్పు తెచ్చేందుకు కృషి చేయాలి. ప్రభుత్వానికి భారీ ఎత్తున నష్టం చేకూర్చే నిషేధాన్ని ప్రభుత్వమే ఏక పక్షంగా విధించ జాలదు. దీన్ని పుద్ధుకునేందుకు వావిలాల గోపాలకృష్ణయ్య గారిచ్చిన సూచనలు పరిశీలించి, ప్రత్యామ్నాయ మార్గాలు ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. లేకుంటే గతం మళ్లీ గుర్తుకు రాక మానదు.

కోవూరు -అనుపమ

## ధనస్వాముల వల్ల రాజకీయాలు కలుషితం

'తస్మాత్ జాగ్రత్త' శీర్షికలో

**జనవాణి**

మీ పత్రికలో వచ్చిన ప్రస్తుత రాజకీయ పరిస్థితి పై తులనాత్మక పరిశీలన ఆలోచనా స్ఫూరకంగా వుంది. ధనిక వర్గాలు రాజకీయాల్లోకి రావడం వల్ల ప్రజాసేవలో వున్న కార్యకర్తలకు న్యాయం జరుగక పోగా రాజకీయాలు కలుషితమై పోతున్నాయి. పార్టీ కోసం ఎన్నో త్యాగాలు చేసిన నాయకులు, కార్యకర్తలకు గుర్తింపు లేకుండా పోతున్నది. ధనస్వాములను రాజకీయాల్లోకి ఆహ్వానించడం వల్లనే ఇదంతా జరిగిందనేది వేరే విషయమైనా, దీనికి కారకులైన వారిని గూర్చి కూడా మీరు రాస్తే బాగుండేది. డబ్బు దస్కం వుండబట్టి పది మంది ఈ ధనస్వాముల వెనుక బడి తిరగవచ్చు. అది హృదయ పూర్వకంగా వుండదు. నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి ప్రజల మనిషి కాబట్టి పార్టీలు మార్చినా ఢంకా బజాయించి గెలుస్తునే వుండినా. ప్రజల మనుషులకట్టేందుకు ధనస్వాములు ప్రయత్నించాలి. లేకుంటే కోవూరు గుణపాఠం మళ్లీ పునరా వృతమవుతుంది.

-ఎ.వి.ఎస్. యాదవ్

వెంకటగిరి

కొరవ 8 పేజీలో

# తీరప్రాంత భూములు మహిళలకే ఇస్తారు!

తీర ప్రాంతాల్లోని ప్రభుత్వ భూముల్లో 60 శాతం మత్స్య కారులకు ఇచ్చే భూములను మహిళల పేరిట ఇవ్వనున్నట్లు రాష్ట్ర మత్స్య శాఖ మంత్రి మల్లాది స్వామి చెప్పారు. జాతీయ మత్స్య కారుల జిల్లా సంఘం పర్మినెంట్ ఫండ్ భవనంలో మంత్రికి సన్మాన కార్యక్రమం ఏర్పాటు చేసింది. ఈ సందర్భంగా మంత్రి మాట్లాడుతూ రాష్ట్రంలో మత్స్యకారులకు గత ఏడాది అయిదు వేల ఇళ్లను ప్రభుత్వం నిర్మించి యిచ్చింది. రాష్ట్రంలో డ్వాక్రా పథకం క్రింద అయిదు వేల మంది మత్స్య కారుల మహిళలకు ఒక్కొక్కరికి వెయ్యేసి రూపాయల వంతున కేటాయించ నున్నట్లు చెప్పారాయన. జిల్లాలో మత్స్య శాఖ కార్యాలయ భవన నిర్మాణం కోసం 16 లక్షల రూపాయల నిధులను ప్రభుత్వం ద్వారా మంజూరు చేయిస్తానన్నారు. ట్రైకప్ రోడ్‌లోని చేపల మార్కెట్‌లో కనీస సౌకర్యాలు కల్పించమని జిల్లా కలెక్టర్‌ను కోరినట్లు చెప్పారు. కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు మాట్లాడుతూ రొయ్యల, చేపల పెంపకం వల్ల తీర ప్రాంతాల్లో తాగు నీరు, రహదారుల సమస్య వచ్చినా, పరిష్కారానికి తగిన చర్యలు తీసుకొంటున్నట్లు చెప్పారు. కార్యక్రమంలో ఎమ్మెల్యేలు జె.కె. రెడ్డి, పి.వి. శేషారెడ్డి పాల్గొన్నారు. జిల్లా మత్స్యకారుల సంఘం అధ్యక్షుడు రాజసింహ సభకు అధ్యక్షత వహించారు. మంత్రి మల్లాదిస్వామిని ప్రభుత్వ విప్ పి.వి. శేషారెడ్డి చేతుల మీదుగా సన్మానింప జేశారు.

## పాత ఛైర్మన్‌కు వీడ్కోలు- కొత్త ఛైర్మన్‌కు సన్మానం!

జిల్లా గ్రంథాలయ సంస్థ వుద్యోగుల యూనియన్ తమ సంస్థ పాత ఛైర్మన్ బద్దెపూడి వేణుగోపాల రెడ్డికి వీడ్కోలు, కొత్త ఛైర్మన్ మెట్టా చంద్ర శేఖర్ రెడ్డికి అభినందన సభను 23 తేది ఏర్పాటు చేసింది. రాష్ట్ర పౌర గ్రంథాలయ అసిస్టెంట్ డైరెక్టర్ మోహన రావు కార్యక్రమానికి అధ్యక్షతవహించారు. బద్దెపూడి వేణుగోపాల రెడ్డి మాట్లాడుతూ సంస్థ అభివృద్ధికి తన శక్తి మేర కృషి చేసినట్లు చెప్పారు. కొత్త ఛైర్మన్ చంద్రశేఖర్ రెడ్డి వుద్యోగుల సమస్యలను వెంటనే పరిష్కరిస్తానని హామీ ఇచ్చారు. యూనియన్ అధ్యక్షుడు ఇస్కా సుబ్బారెడ్డి, గ్రంథాలయ సంస్థ జిల్లా కార్యదర్శి వి. రమాపతి రాజు కూడా వుపన్యసించారు. అనిల్ బుక్ సెంటర్ అధినేత వాసు పాత, కొత్త ఛైర్మన్‌లను దుశ్శాలువాలతో సత్కరించారు. యూనియన్ కార్యదర్శి ఎం. వెంకటేశ్వర రావు వందన సమర్పణ చేశారు.

## నెల్లూరు సంగతులు

### రైతుల కోసం చర్చా వేదికలు

కొందరు అధికారులు నిరంతరం ఏదో ఒక పని చేయనిదే వూరకుండలేరు. ఆ కోవలో నెల్లూరు వరి పరిశోధన స్థానం అధిపతి డాక్టర్ సి. రాఘవ రెడ్డి చేరుతారు. రైతులను చైతన్య వంతం చేసేందుకు ఏదో ఒక కార్యక్రమం పరిశోధన స్థానంలో ఏర్పాటు చేస్తుంటా రాయన. 23 తేది చర్చా వేదిక అనే కొత్త కార్యక్రమానికి శ్రీకారం చుట్టి రైతులు ఈ సంవత్సరం ఎటువంటి పంటను వేయాలో వివరిస్తూ రైతుల సందేహాలు తీర్చారు. ఇప్పటికీ నీరు వదలని ప్రాంతాల్లో దీర్ఘ కాల మొలగొలుకుల రకాలు వేసే దానికన్నా మధ్య కాలిక రకాలైన స్వర్ణముఖి, ఎన్.ఎల్.ఆర్. 145, ఎన్.ఎల్.ఆర్ 33057, ఎం.టి.యు 4870 రకాలను సాగు చేస్తే మంచిదని సూచించారు. ఆ రకాలను ఇప్పుడు నారు పోసినట్లయితే మొలగొలుకుల రకాల కన్నా తక్కువ దిగుబడి రావటు. సెప్టెంబరు నెలలో ఎన్.ఎల్.ఆర్. 33641 మొలగొలుకులతో పాటు సి.ఆర్. 1009 రకాన్ని నారు పోసు కోవడం మంచి దంటున్నారు. అక్టోబరు 15 - నవంబరు 15 మధ్య కాలంలో నారు పోస్తే దిగుబడి ఎక్కువగా వుంటుందని రైతులకు వివరించారాయన. స్వర్ణ ముఖిరకం 135 రోజుల్లో, ఐ.ఆర్. 20 రకం కన్నా, 10 నుంచి 15 రోజుల ఆలస్యంగా కోతకు రావడం వల్ల చెరువుల క్రింద చివర పొలాల్లో నీటి సమస్య వున్న చోట్ల ఇబ్బంది కలుగు తుందన్నారు. అలాంటి చో.. ఎన్.ఎల్.ఆర్. 33057 రకం తక్కువ కాల పరిమితి కలిగి ఐ.ఆర్. 20 కన్నా 5 నుంచి ఆరు రోజులు ముందుగా కోతకు అనువుగా వుంటుం దంటున్నారు. స్వర్ణముఖి (ఎన్.ఎల్.ఆర్. 145), ఎన్.ఎల్.ఆర్. 33057 రకాలు అగ్గి తెగులును బాగా తట్టుకొంటాయని, ఐ.ఆర్. 20 కన్నా హెచ్చు దిగుబడి నిస్తాయని, స్వర్ణముఖి మూడు నుంచి నాలుగు పుట్ల వరకు పండి ఇప్పటికే రైతులడిగిన మన్నలను పొందిందన్నారు.

నారు పోసిన పది రోజుల్లో కార్బో ఫురాన్ గుళికలు పది సెంట్ల నారు మడికి 1.6 కిలోల ప్రకారం చల్లాలని చెప్పారు. నారు మడిలో నీరు ఒకటి నుంచి రెండు అంగుళాల మధ్య ఉండేటట్లు చేసి రెండు రోజుల వరకు నీరు పెట్ట రాదని చెబుతూ రైతుల పలు సందేహాలు తీర్చారు.

### అక్కినేని జన్మదినం

ప్రసిద్ధ సినీ నటులు డాక్టర్

కొరవ 10 పేజీలో



వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అంతర కళాశాలల పటిల్ బ్యాడ్మింటన్ పోటీలలో ప్రథమ బహుమతి పొందిన వి.ఆర్ కాలేజి విద్యార్థులు జి. వేణుమాధవ్, ఎ. రవిరాజ్‌లతో ప్రిన్సిపల్ డాక్టర్ డి. గోపాలకృష్ణమూర్తి, కార్యదర్శి ఆనం వివేకానందరెడ్డి

## స ఋ గు డు

### చరిత్రలో నిల్చిపోతాడు కలెక్టర్ సాంబశివరావు!

కలెక్టర్‌గా శ్రీ సాంబశివ రావు గారు పదవి స్వీకరించి మొన్న 26తేదికి రెండేళ్ళు గడి చాయి. జిల్లాకు ఇప్పటి కెందరో కలెక్టర్లు వచ్చారు; వెళ్లారు. శంకరన్, అర్జున రావు, కె. రాజు వంటి ఒక రిద్దరి పేర్లు మాత్రమే జనానికి గుర్తున్నాయి. అటు వంటి జనరంజకమైన కలెక్టర్లలో సాంబశివరావు గారు ఒకరు. "నొప్పించక, తానొవ్వక తప్పించుక తిరుగు వాడు ధన్యుడు" అన్న సూక్తిని సాంబశివరావు గారిని చూసే చెప్పి వుంటాడా సుమతి శతక కారుడు అన్పిస్తుంటుంది - ఆయన్ను చూస్తే! రాజకీయ విబేధాల ఊబిలో జిల్లా మొత్తం గొంతు వరకు కూరుకొని పోయిన వాతావరణంలో వివాద రహితుడుగా నెగ్గుక రావడ మంటే మాటలు కాదు. ఎవరు వచ్చినా చిరు నవ్వుతోనే స్వాగతం; సౌమ్యమైన పలుకరింపు; ఎవ్వరేది అడిగినా కాదనేదే వుండదు; కాని ఎవ్వరికి చట్టానికి, ఆత్మసాక్షిగా వ్యతిరేకంగా పనిచేసి పెట్టే ప్రసక్తి తలెత్తదు. నిజాయితీకి; నిష్కల్మషత్వానికి. ఎదుటి వారు నొచ్చుకోకుండా, కించ పడకుండా నిర్మొగ మాటంతో వ్యవహరించడానికి కలెక్టర్ సాంబశివ రావు గారు ఒక సంకేతంగా వ్యవహరించా రింత కాలం. అందరికీ సాధ్యం కాని లౌకికం అది.

జిల్లాలో ఒక చారిత్రక యుగం నడుస్తున్నప్పుడు కలెక్టర్‌గా వుండ గల్గడం సాంబశివ రావు గారు చేసుకున్న భాగ్యం. ఆయన జాయింట్ కలెక్టర్‌గా ఇక్కడున్నప్పుడే జిల్లాలో అక్షరాస్యతా ఉద్యమం మొదలైంది. మాజీ కలెక్టర్ శ్రీ కె.రాజు ఆ ఉద్యమ నిర్వహణకు పడిన తపన, అంకిత భావంతో చేసిన కృషి అనుపమానమైనవి. జీతం తీసుకొనే ఉద్యోగిగా కాకుండా, జీవితాన్ని అంకితం చేసిన సంఘ సంస్కర్తగా

### డోలేంద్ర

పనిచేశారు శ్రీ రాజు. ఆ ఉద్యమం ఫలించిందా; ఎందరు నిరక్షరాస్యులు అక్షరాలు వ్రాయడం నేర్చుకొన్నారు; అందుకు జరిగిన ఖర్చెంత, లభించిన ప్రయోజన మెంత వంటి ప్రశ్నలు, వివాదాలు ప్రక్కన పెట్టండి. రాజు గారు నడిపిన ఆ ఉద్యమం పల్లె జనంలో, పాటక జనంలో చైతన్యం తెచ్చింది. వారిలో జాగృతిని పురికొల్పింది; వారిలో ఆత్మ విశ్వాసాన్ని ప్రేరేపించింది. ఆ జాగృతే తర్వాత సారాయి నిషేధ ఉద్యమానికి వూతగా నిల్చింది. ఈ సంఘటనన్నిటినీ సునిశితంగా, సన్నిహితంగా పరిశీలించే అవకాశం

కొరవ 7 పేజీలో

మాగుంట బలాధిక్య నిరూపణ కాదు

# ధనగర్వ ప్రదర్శన!

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి బలాధిక్యత నిరూపణ కోసం రేపు (1 తేది) జరగబోతున్నకేంద్రరవాణా మంత్రి జగదీశ్ టైట్లర్ నెల్లూరు పర్యటనకు కనీ వినీ ఎరుగని రీతిలో ఏర్పాట్లు జరిగి పోతున్నాయి. ఒక సాధారణ కేంద్ర మంత్రికి ఇంతటి స్వాగతాడంబరం ఇప్పటి వరకూ

> బస్సు, లారీలకు ఏడేసి వేలు, ట్రాక్టర్‌కైతే 4 వేల లెక్కన జనాన్ని తోలే కాంట్రాక్టు; కోటి ఖర్చుకు మాగుంట రెడీ!

చూడలేదు, ఇక ముందు చూడబోము. ఖర్చు అంచనా అర కోటి రూపాయలట. ఇంకెంత అయినా వెనుకాడేది లేదు; ఏర్పాట్లు మాత్రం అదిరి పోవాలి అని ఆదేశమిచ్చారట

అవే! వారం రోజుల క్రితం పని మొదలు పెట్టినా పూర్తి కానంత భారీ సెట్టింగుల మాదిరి వున్నాయవి. పెరేడ్ గ్రౌండ్‌లో ఆర్ అండ్ బి శాఖ ప్రధాన మంత్రి, రాష్ట్రపతిల ప్రోటోకాల్ పాటించి బ్రహ్మాండమైన వేదిక నిర్మిస్తున్నది. గ్రౌండ్ చుట్టూ సభకు రానున్న మంత్రులు, నాయకులను స్వాగతిస్తూ బ్యానర్లతో అలంకరించారు. రెండు ప్రధాన గేట్ల దగ్గర రెండు ఆర్చీలు నిర్మించారు. లైట్లు ఎన్నో లెక్కవేయడం సాధ్యం కాదు. స్టేజి నంతటినీ పూలతో అలంకరించ నున్నారట.

జన సమీకరణ యత్నం విస్తృతంగా సాగుతూంది. వంద మంది జనాన్ని తోలుక వస్తామని నమ్మబల్కిన వారి కంతా జేబులు నిండి పోతున్నాయి. ఎక్కడెక్కడి లారీలు, ట్రాక్టర్లు, బస్సులు బుక్ అయి పోయాయి. ఒంగోలు జిల్లా నుంచి కూడా జనాన్ని తెప్పిస్తున్నారట. మనిషికి వంద ఇచ్చి అయినా సరే - లక్షకు తక్కువ కాకుండా గ్రౌండ్‌ను నింపాలన్నది నిర్వాహకుల పట్టుదల. 28 తేది సాయంత్రం ఈ ఏర్పాట్ల కోసం ఎమ్మెల్యే జెకె రెడ్డి ఇంట్లో

వేసుకునేటట్లు చూస్తున్నారు. జెకె రెడ్డి, విష్ణువర్ధన రెడ్డి, జానకి రాం మినహా ఇప్పటి వరకు ఇతర ఎమ్మెల్యే లెవరూ వలలో చిక్కినట్లులేదు. సెంట్రల్ బ్యాంక్ అధ్యక్షుడు శ్రీ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గ్రూపు గిపు జాంటానై, సభకు వస్తానన్నారట. సివి శేషారెడ్డి, పత్రా ప్రకాశ రావుల పై వత్తిడి పెరుగు తున్నది. మంత్రి శ్రీ పెంచలయ్యను అసలు పిలువలేదు. రేముళ్ల మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి, ఎన్నికల సమయంలో ఈ చీలికలు పార్టీకి అనర్థం కాబట్టి రాను పొమ్మన్నాడట. రాష్ట్ర మంత్రులందరికీ ముఖ్యమంత్రి ఫోన్లు చేసి ఆదేశా లిచ్చారు- నెల్లూరు వెళ్ళి రమ్మని!

* * *

ఇంత ఖర్చు, ఇంత ఆగం, ఇంత ఆడంబరం, ఇంత హంగామా

## పోలీసధికారి పుట్టినరోజుకు వజ్రాల నెక్లస్ బహుమానం!

నెల్లూరులోని ఒక ఉన్నత పోలీసధికారికి వజ్రాల నెక్లస్ బహుమానంగా లభించింది. ఆయన పుట్టిన రోజు సందర్భంగా, హై క్లాస్ సొసైటీకి పరిమితమైన కొద్ది మంది అతిథులు కానుక లివ్వడానికి పోటీలు పడ్డారట. వాటిలో ఇదే ఖరీదైనది. విలువ రెండు లక్షలుండవచ్చునంటున్నారు. ఇంత విలువైన బహుమతు లివ్వగల స్తోమత, తెంపు టౌన్‌లో ఎవరికున్నాయో వేరే చెప్పాలా? అందరి ఎదుటా వారు పూల మాల వలె ఈ బంగారు దండను మెడలో వేస్తుంటే చప్పట్లు మార్మోగి పోయాయట. ఆ శబ్దం శేషన్‌కు వినిపిస్తే లెక్క తిమారు తీరిపోతాయి!

రాజకీయాలు, వ్యాపారం కలగా పులగంగా నిర్వహిస్తున్న సంపన్న కుటుంబీకుల నుంచి పోలీసధికారులు ఎన్నికల సమయంలో ఇటువంటి బహుమతులు పబ్లిక్‌గా స్వీకరించడం మొదలుపెడితే ఆ శాఖపట్ల ప్రజలలో విశ్వాసం మిగులుతుందా?

ఇదటుంచితే, జిల్లాలో పోలీసు సేవా సంఘం భవనం నిర్మించాలనే నెపంతో అక్వా కంపెనీల నుంచి పోలీసధికారులు పెద్ద పెద్ద మొత్తాలు విరాళాలు స్వీకరిస్తున్నారు. కంపెనీ స్తోమతను బట్టి ఒకటి నుంచి ఐదు లక్షల వరకు కోటాలు నిర్ణయిస్తున్నారు. ఇప్పటికి ఇరవై లక్షలు జమ పడిందని, యాభై లక్షలు లక్ష్యంగా పెట్టుకొని దందకాలు సాగుతున్నాయని వినికిడి. ఇదేమి డబ్బు పిచ్చండీ బాబూ!

# వలలో ఒక్క చేప పడలేదు!

సృష్టించి ఏమి సాధించ నున్నట్లు? జగదీశ్ టైట్లర్ కాంగ్రెస్ పార్టీలో కాని, ప్రజలలో కాని పలుకు బడి కల్గిన నాయకుడు కాడు. ఢిల్లీలో రౌడీ గ్యాంగ్ కల్గిన వ్యక్తిగా మాత్రమే ఆయనకు గుర్తింపు. ఆయన శాఖసైతం

జనార్ధనరెడ్డి ముఖ్యమంత్రిగా, జెకె రెడ్డి పట్టుదలతో వచ్చిన రోడ్డు ఇది. 92 లోనే దానికి శంకుస్థాపన జరిగింది. 37 కోట్ల బైపాస్ రోడ్డుకు కూడా కేంద్రం చిల్లి గవ్వ ఇవ్వడం లేదు. వారు కేవలం ఎస్టిమేషన్ మాత్రం తయారు చేశారు. ప్రైవేటు కంపెనీలు దీన్ని నిర్మిస్తాయి. ఆ నిధులు రాబట్టు కోవడం కోసం ఆ కంపెనీ టోల్‌గేటు నిర్వహించి లారీలు, బస్సుల నుంచి డబ్బు దండుతుంది. చిన్న వ్యాపారం కాదది. ఏడాదికి పది కోట్లు ఆదాయం తెచ్చి పెట్టే లాభసాటి కాంట్రాక్టు. ఇందులో టైట్లర్ నెల్లూరుకు చేస్తున్న ఉపకారం ఏదీ లేదు. అంతగా అయితే ఈ స్వాగతార్భాటానికి మురిసి పోయి కోరిన కంపెనీకి కాంట్రాక్టు ఇస్తాడేమో! ఆ కంపెనీ ఏది కాబోతున్నదనే దాని మీద ఈ ఆర్భాటం వెనుక అంతరార్థం అవగత మౌతుంది.

నిజమని ధృవపడలేదుకాని, ఈ రోడ్డు టోల్‌గేటు కంట్రాక్టు కోసం ప్రయత్నిస్తున్న వారిలో, ఈ సభ నిర్వాహకులూ కొందరున్నారని వినికిడి. అందుకోసమే ఈ హంగామా అని కూడా అంటున్నారు. నిజం దేముడెరుగు!

నెల్లూరు టౌన్‌లో నడిచే ట్రంకురోడ్డును సిమెంట్ చేయడానికి 9 కోట్ల పథకం ఒకటివుంది. టౌన్‌కు వుపయోగ పడే కార్యక్రమం ఇది. కేంద్రం, రాష్ట్రం రెండూ ఖర్చును చెరి సమానంగా భరిస్తాయి. అయితే వున్న రోడ్డు పై సిమెంట్ పరవడం కాకుండా, ఈ డబ్బు ఖర్చు పెట్టి దాన్ని నాలుగు లైన్ల రోడ్డుగా అభివృద్ధి చేయగల్గితే నెల్లూరు పౌరులు సుబ్బరామరెడ్డి గారికి నిజంగా ధన్యవాదాలు చెల్లిస్తారు. రోడ్డును ఇరుకుగా అట్టిపెట్టి సిమెంట్ పరిస్తే కాంట్రాక్టర్లు బాగు పడ్తారు తప్ప, ప్రజలకు వుపయోగం లేదు. టైట్లర్‌తో మాట్లాడి ఈ మార్పుకు

ఒప్పించడం బాగుంటుంది.

* * *

ఈ బల ప్రదర్శన వల్ల మాగుంట సుబ్బరామ రెడ్డి గారికి కాని,

> జనార్ధన వర్గాన్ని చీల్చే యత్నం విఫలమైంది; బైపాస్ రోడ్డుకు టైట్లర్ పైసా ఇవ్వడం లేదు; నెల్లూరులో ఆర్భాటం చేస్తే ఢిల్లీలో టికెట్లు ఇస్తాడా పివి?

కాంగ్రెస్ పార్టీకిగాని రాజకీయంగా ఏదైనా వుపయోగం వుంటుందా? మాకు తెలిసి అటువంటి దేదీ

కొరవ 12 పేజీలో

### ఎవడబ్బ సొత్తు ఈ కరెంట్?

టైట్లర్ స్వాగతార్భాటం కోసం టౌన్‌లో ఆరు కిలో మీటర్ల పొడవునా అలంకరించిన విద్యుద్దీప తోరణాలకు పబ్లిక్‌గా కరెంట్ స్తంభాల నుంచి వైర్లు లాగి కరెంట్ వాడుతున్నారు. కానీ ఖర్చు లేదనే చులకన భావంతో కాటోలు పగలు కూడా వెలుగుతూనే వున్నాయవి! ఎంత దండగ? అడిగే ధైర్యం అధికార్లకు ఎక్కడుంది?





పెద్దాస్పత్రి దగ్గర, పోలీసు పెరేడ్ గ్రౌండ్స్‌లో కరెంట్ తీగలు లాగి లైట్లు వెలిగించిన దృశ్యం

సుబ్బరామ రెడ్డి గారు. రాజా తల్చుకుంటే కానిదేముంది. నెల్లూరు వీధుల్లో డబ్బు కాల్వలు కట్టి పారుతూంది. అయ్యప్ప గుడి నుంచి పోలీస్ పెరేడ్ గ్రౌండ్ వరకు ట్రంకు రోడ్డు పైన; పోలీస్ పెరేడ్ గ్రౌండ్ నుంచి పెద్దాస్పత్రి వరకు పొదలకూరు రోడ్డులోనూ రోడ్డుకు రెండు వైపులా విద్యుద్దీప తోరణాలు తగిలించారు. నిశిరాత్రిలో పగటి వెలుగులు కన్పింప జేయడానికి కొన్ని వేల ట్యూబ్‌లైట్లు కాంగ్రెసురంగులకాగితాలు చుట్టి వెలిగించారు. స్వాగత ద్వారాల సంగతి చెప్పనే అవసరం లేదు. టౌనంతా

ప్రత్యేక సమావేశం జరిగింది. నాయకులకు వాహనాలు, డబ్బు అందజేశారు. లరీ, బస్సులకైతే 7వేలు. ట్రాక్టర్‌కు 4వేలు లెక్కన కాంట్రాక్టు నిర్ణయించారు. బండ్ల నంబర్లు చెప్పి, మనుషుల లెక్కచూపితే అక్కడికక్కడే డబ్బు పంచేస్తారట. ఇదేదో మంచి లాభసాటి వ్యాపారంగా వుంది. గ్రామస్థాయి నాయకులు ఎగబడి మరీ జనం తోలకం ఒప్పందం కుదుర్చు కుంటున్నారు.

జిల్లాలో జనార్ధనరెడ్డి అనుచరులుగా వున్న వారందరినీ పేరు పేరునా పలుకరించి సభలో ప్రెజెంట్

కీలకమైనది కాదు. పైపెచ్చు నెల్లూరు ప్రజలకు ఆయనతో పరిచయం లేదు. ఉదయగిరి ఎమ్మెల్యే శ్రీ మాదాల జానకి రాంకు రాజకీయ గురువుగా, కష్టాలలో ఆదుకునే మిత్రుడుగానే టైట్లర్‌కు రాష్ట్ర రాజకీయాలతో సంబంధం! అటువంటి సాధారణ కాంగ్రెస్ వాదిని ఇంత దడబడలతో సంతుష్టుడ్ని చేసినందువల్ల ఎవరికి ప్రయోజనం? బైపాస్ రోడ్డుకు నిధులు మంజూరు వట్టి మాయ మాటే! ఇప్పుడు ప్రారంభోత్సవం చేయనున్న రాజీవ్ రోడ్డు అనబడే మినీ బైపాస్ రోడ్డుకు కేంద్రం పైసా నిధులివ్వలేదు.

# నెల్లూరు నలుచెరగుల్లో

## విమర్శకుడు

### గవర్నర్

రాష్ట్ర గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ అక్టోబరు 11తేది నెల్లూరు రానున్నారు. ఆరోజు సాయంత్రం టౌన్‌హాల్‌లో జరిగే లోక్‌నాయక్ జయప్రకాశ్ జయంతి సభలో పాల్గొంటారు. శ్రీ తుంగా పాండురంగారెడ్డి పదేళ్లకు పైనుంచి క్రమం తప్పకుండా నిర్వహిస్తున్న ఈ జయంత్యుత్సవంలో ప్రఖ్యాత జర్నలిస్ట్ కులదీప్ నయ్యర్ ప్రధాన ప్రసంగం చేస్తారు.

గవర్నర్ గారు 11 తేది వారు విద్యాసంస్థలు సందర్శించి, వెంకటగిరిలో శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి నిర్మింప జేసిన ప్రగతి స్తూపం ఆవిష్కరించ వలసి వుండింది. ఎన్నికల కార్యక్రమం వల్ల అవి వాయిదా పడుతాయో, జరుగుతాయో ఇంకా స్పష్టం కాలేదు.

### జనార్ధనరెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి 28 తేది నెల్లూరు వచ్చారు. ఆ సాయంత్రం నర్తకూరు సెంటర్‌లో ఎమ్మెల్యే శ్రీ సివి శేషారెడ్డి జరిపిన పెద్ద బహిరంగసభలో పాల్గొని, ఇందిరమ్మ విగ్రహం ఆవిష్కరించారు. సభకు స్వచ్ఛందంగా తరలివచ్చిన ఆ జనసందోహాన్ని చూస్తె ఎన్నికలు దగ్గరపడేకొద్ది కాంగ్రెస్ పట్ల అభిమానం పెరిగిపోతున్నదా అన్పిస్తోంది.

29,30 తేదులలో జనార్ధనరెడ్డి గారు వెంకటగిరి నియోజక వర్గ పరిధిలో చేరిన నాయుడుపేట, ఓజిలి ప్రాంతాల స్థానిక నాయలతో సమావేశాలు నిర్వహించారు. 3తేది వరకు ఆయన వాకాడులో వుంటేట్లున్నారు.

### ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు నక్సలైట్లు హతం

నెల్లూరు పొలిమేరలలో, కోవూరు బైపాస్ రోడ్డు దగ్గర 29 తేది వేకువన పోలీసులతో జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు నక్సలైట్లు చనిపోయారు. గణపతి వర్గానికి చెందిన పీపుల్స్‌వార్ కోస్తా, రాయలసీమ జిల్లాల ఆర్గనైజర్ చింతల వెంకటస్వామి అలియాస్ సూర్యం(40) మరొక 35 సంవత్సరాల గుర్తుతెలియని మహిళ ఈ కాల్పులలో మరణించారు. పీపుల్స్ వార్‌లో సూర్యం చాలా కీలకమైన నాయకుడు. ఆయన్ని పట్టించిన వారికి 8 లక్షల బహుమతి ప్రకటించి వుండంటేనే సూర్యం విలువ అర్థం చేసుకోవచ్చు.

ఎస్.పి. శ్రీ రమణమూర్తి కథనం ఇలావుంది. నెల్లూరు పరిసరాలలో నక్సలైట్ల రహస్య సమావేశం జరగనున్నదని సమాచారం అందిందట. పొలిమేరలన్నిటిలో నిఘావేసి వుండినారు. 29తేది అర్ధరాత్రి దాటిన తర్వాత కోవూరు బైపాస్ రోడ్డు పరిసరాలలో సూర్యం కదలికలు పసిగట్టి, అనుమానించి, ప్రశ్నించబోయారట. ఆయన తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ కాల్పులు జరిపాడు. పోలీసులు తిరిగి 20 రౌండ్ల తూటాలు పేల్చేశారట. తర్వాత చూస్తె రోడ్డుకు దగ్గరగా సూర్యం, ఆ మహిళ శవాలు పడి వుండినాయి. ఆమె ఎవరో ఇంకా గుర్తించ లేదు. ఆమె పసుపు గుడ్డపై ఎరుపురంగు పూలున్న పంజాబీ డ్రస్ వేసుకొని వుంది. ఆమె హ్యాండ్ బ్యాగ్‌లో రెండు బంగారు గాజులు, దండ, కమ్మలు, రిస్ట్‌వాచి, 8 బుల్లెట్లు వుండినాయి. శవాల ప్రక్కన అమెరికన్ రివాల్వర్, బోర్‌గన్, తపంచ, కొన్ని బుల్లెట్లు పడివుండినాయట. ఇవి ఎస్‌పి గారు చెప్తున్న వివరాలు. పోలీసులు ఆ శవాల పరిసరాలకు కూడా ఎవర్నీ రానివ్వలేదు. ఫోటోలు తియ్యనివ్వలేదు.

ఈ ఎన్‌కౌంటర్‌పై పలు సందేహాలు కల్గుతున్నాయి. నేషనల్ హైవే ప్రక్కన కాల్పులు జరపడం సాధ్యమా? 20 రౌండ్లు తుపాకి పేలిస్తె ఒక్కరికీ శబ్దం విన్పడిన దాఖలాలు లేవేమి? ఆ చుట్టు ప్రక్కల పొలాలలో చాలా మంది కాపురాలు వుంటున్నారు కదా? నక్సలైట్లు పోలీసులను చూసి ప్రక్కనే వున్న చెరకు తోట వంటి మరుగు ప్రదేశానికి వెళ్లి తలదాచుకోక, రోడ్లోకి వచ్చి ఎందుకు కాల్చారు? ఇది నిజంగా ఎన్‌కౌంటరేనా? ఎక్కడో చంపి, ఇక్కడ అల్లిన కథా? నిజం మనకెట్లా తెలుస్తుంది చెప్పండి?

### టీచర్ల నియామకాలు నిలిపి వేశారు

నెల్లూరు జిల్లాలో జరిగిన సెకండరీ గ్రేడ్ టీచర్ల నియామకాలకు సంబంధించి ఇంటర్వ్యూ ఫలితాలు నిలిపి వేశారు. జాబితాలు సిద్ధం చేసి పెడతారట కాని బయటకు చెప్పరు. ఎన్నికలు పూర్తయి, కొత్త ప్రభుత్వం ఏర్పడినంత వరకు వాటికి గ్రహణం పట్టినట్లే! ఎన్నికల ప్రవర్తనా నియమావళి నిషేధం వల్లనేకాక, ట్రిబ్యునల్ స్టే కారణంగా కూడా నియామకాలు పెండింగ్‌లో పెట్టినట్లు కలెక్టర్‌గారు తెలియజేశారు. నిరుద్యోగులు పాపం నిరాశతో చతికిలబడి పోతారు.

### ప్రజానిర్ణయం

జమీన్‌రైతులో దీర్ఘకాలం అకౌంటెంట్‌గా పనిచేసి తర్వాత స్వంతంగా ప్రెస్‌పెట్టుకొని గుట్టుగా బ్రతుకు తుండిన, జమాఖర్చు లెక్కల్లో చిత్రగుప్తుడనదగిన చిగురు పాటి మాల్యాద్రి "ప్రజానిర్ణయం" పేరుతో ఒక స్వంత వార పత్రిక ప్రారంభించాడు. తాను ఛీఫ్ ఎడిటర్; తన కొడుకు ఎడిటర్; రీడర్స్‌గాగానైనా బయటివారికి ఛాన్సిస్తాడో లేదో మాడాలి! మాగుంట కుటుంబీకుల ఆశీర్వాదం పొందాడు కాబట్టి ఆర్థికంగా లోటు వుండదు. గుడ్‌లక్!

### టౌన్‌మహిళాకాంగ్రెస్ అధ్యక్షురాలు అరుణమ్మ



కాంగ్రెస్ భక్తురాలు, పార్టీ పని పడితే ఇల్లు, పిల్లు మరచి రాత్రింబవళ్లు చాకిరీ చేసే సేవకురాలు, బాలాజీనగర్‌లో కాంగ్రెస్‌ను ఎత్తుకొని మోసే శ్రీమతి పందిళ్లపల్లి అరుణమ్మను నెల్లూరు టౌన్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలిగా నియమించారు.

ఇన్నాళ్లకు అరుణమ్మకు ఈ చిన్న గుర్తింపైనా వచ్చింది; సంతోషం.

### యునిసెఫ్ ప్రతినిధి రాక

ఐక్యరాజ్యసమితి స్త్రీ, శిశు సంక్షేమ విభాగం- యునిసెఫ్ భారత ప్రతినిధి డాక్టర్ జాన్‌ఇలియట్ రోడె ఈరోజు (30తేది) మధ్యాహ్నం నెల్లూరు వస్తున్నారు. బుచ్చి, గాంధీజన సంఘం, సంగం గ్రామాలలో మహిళా

కొరవ 7 పేజీలో

## సణుగుడు

4వ పేజీ కొరవ

లభించడం సాంబశివ రావు గారి అదృష్టం. ఆ అనుభవం ఆయనకు ఈ రెండేళ్లలో ఎంతగానో ఉపకరించింది.

జిల్లాలో సారా నిషేధం ఈ మాత్రమైనా అమ... జరుగుతున్నదంటే, అది ఈ ఇద్దరు అధికారుల కృషి ఫలితమే! జనం చేత సారా మాన్పించడం అంత సులువైన పని కాదు. కొన్ని వందల సంవత్సరాల నుంచి మన సమాజంలో కల్లు వంటి మత్తు పదార్థాల వ్యసనం వుంది. మన దేశంలోనే కాదు, ప్రపంచ మానవ చరిత్రలోనే అదొక విడదీయ రాని భాగం. గాంధీ మహాత్ముడికే సాధ్యం కాలేదు - త్రాగుడు మాన్పించడం; మొరార్జీ దేశాయ్ వంటి మొండి మనిషి కూడా సారా నిషేధాన్ని అమలు చేయడంలో విఫలమైనాడు. సంఘ సంస్కర్తలు, మహాత్ముల నడగిన జాతీయ నాయకులకే అలవి కాని సాంఘిక సంస్కరణోద్యమాన్ని పునః ప్రారంభించడం ఇద్దరు అధికారుల తరమా? అయినా వారు సాహసించారు. చిత్తశుద్ధితో నిర్వహించారు. ఈ రోజు నెల్లూరు జిల్లా మహిళల సాహసోపేత ఉద్యమ సాఫల్య దీక్ష దేశ విదేశాల్లో మార్మోగుతున్నదంటే - దాని వెనుక వీరిద్దరి కృషి నిక్షిప్తంగా వుంది. అవినీతికి ప్రతిరూపాలైన ఎక్సైజ్, పోలీసు శాఖల నుంచి వత్తిడి ఎదురు కాకుండా, మహిళలు తమ ఆందోళనను కొనసాగించ డానికి అధికార పరంగా, నైతికంగా వీరిద్దరూ కల్పించిన మద్దతు అనుపమానమైనది. సారా ఉద్యమ చరిత్రలో రాజా గారి కృషి, పట్టుదల; సాంబశివ రావు గారి సహకారం శాశ్వతీకరించాలి; చెరిగి పోకుండా వ్రాయాలి.

అక్షరాస్యత, సారాయి ఉద్యమాల ప్రేరణతో, సాంబశివ రావు గారు తనకు తానుగా జిల్లాలో పొదుపు లక్ష్మి ఉద్యమం ప్రారంభించారు. జిల్లాలోని కొన్ని వందల గ్రామాలలో ఇప్పుడు నిరు పేద మహిళలు పైన పైసా కూడబెట్టుకోవడం నేర్చు కుంటున్నారు. వారి పొదుపు మొత్తం చిన్నదే కావచ్చు. కాని, వారినా వైపుకు మళ్లించడం మాత్రం అసామాన్య వ్యవహారం కాదు. పొదుపు లక్ష్మి ప్రచారానికి పెట్టే ఖర్చు, అందుకు తరలింప బడిన అధికారులు, ఉద్యోగుల సమయం విలువ లెక్కిస్తే, పొదుపు మొత్తాల కంటే అధికంగా వుందన్న విమర్శ వుంది. అది నిజం కూడా కావచ్చు. కాని ఈ ఉద్యమాల ఫలితంగా వస్తున్న సామాజిక చైతన్యంతో పోలిస్తే మాత్రం ఖర్చు ఒక లెక్కలోనిది కాదు. వీటి ఫలితాలు వెంటనే చూడలేము. దీర్ఘకాలంలో సంభవించే ప్రయోజనాలనే దృష్టిలో పెట్టుకోవాలి. చాలా కుటుంబాల వారు ఇప్పుడు తమ పిల్లలను బడికి పంపిస్తున్నారు. అయ్యవార్లు బడికి రాకుంటే, తల్లిదండ్రులు నిలదీసి అడుగుతున్నారు. సారా వ్యసనం చాలా కుటుంబాల నుంచి దూరంగా పారిపోయింది. ఫలితంగా ఆయా కుటుంబాల ఆర్థిక పరిస్థితి మెరుగు పడింది. రోజుకు ఒకటి, రెండు రూపాయలు పేద గ్రామీణ మహిళలు పొదుపు చేయగల్గు తున్నారంటే, అందుకు కారణమదే. తమ గ్రామానికి వచ్చే అధికారులను, ఉద్యోగులను ఈ అమాయక ప్రజానీకం తమకు సిద్ధించాల్సిన పథకాల గురించి, గట్టిగా గదమాయించి ప్రశ్నించగల్గుతున్నదీ దీని వల్లనే! త్రాగుడు లేనందువల్ల నేరాలు, ఘర్షణలు తగ్గిపోయాయి. పోలీస్ స్టేషన్‌లో నమోదయ్యే కేసుల సంఖ్య పరిశీలించినా ఇది అర్థమౌతుంది. రేపు జరగనున్న ఎన్నికలలో అభ్యర్థులు గ్రామీణ ప్రజల నుంచి నిష్ఠూరమైన ప్రశ్నలు ఎదుర్కో వలసి రావచ్చు. సారా పొట్లాలు, కరెన్సీ కాగితాలు వెద జల్లి ఓట్లు రాని పోసుకుందామనే వారికి చాలా చేదు అనుభవాలు ఎదురౌతాయి. ఇవన్నీ చాప క్రింద నీరు వలె పరుచుకొని పోయిన సామాజిక మార్పులు. ఉద్యమాల ప్రయోజనం ఈ రూపంలో సిద్ధిస్తున్నది. ఖర్చు, లాభం దృష్టితో కాక ఈ కోణంలో నుంచి చూసినప్పుడు ఈ ఇద్దరు అధికారులు జిల్లాకు చేసిన మేలు ప్రస్ఫుటమౌతుంది.

జిల్లాలో రొయ్యల పరిశ్రమ శరవేగంతో అభివృద్ధి చెందే సమయంలోనూ సాంబశివ రావు గారు కలెక్టర్‌గా వున్నారు. జిల్లా ఆర్థిక స్వరూపాన్ని, ముఖ్యంగా కోస్తా ప్రాంతాలలో పేదరికాన్ని పారద్రోలే ఈ పరిశ్రమ వల్ల ఎదురైన సమస్యలను ఆయన ఎంత ఓర్పుగా, నేర్పుగా పరిష్కరించారో చెప్పలేము. ఇటు మత్స్య కారులను, అటు పరిశ్రమలోని వారిని కష్ట పెట్టకుండా ఆయన లౌకికంగా వ్యవహరించ బట్టి సరిపోయింది గాని, లేకుంటే ఆ సమస్యలు విశ్వరూపం ధరించి పరిశ్రమను పతనం చేయడమే కాకుండా, కోస్తా గ్రామాలు అరాజ యమై వుండేవి.

శంకరన్, అర్జున రావు గ్రామీణ పేదలను పేదరికపు శాపం నుంచి విముక్తం చేయడానికి వల్లు వంచి పని చేసి చిరస్మరణీయులైతే; రాజా, సాంబశివ రావు గారలు పల్లె జనంలో సామాజిక చైతన్యం తెచ్చి వారి భవిష్యత్‌కు పటిష్టమైన పునాదులు వేసి చరిత్రలో నిల్చిపోయే భాగ్యం పొందారు. వారెప్పుడూ నెల్లూరు జిల్లాకు రుణ పడి వుండాలి. ఇటువంటి కృషి వారింకే జిల్లాలో చేసి వుండేవా? ఇంతటి సత్ఫలితాలు సిద్ధించి వుండేవి కావు.

## చెంపదెబ్బ

1వ పేజీ కొరవ

తపన పడ్డారు. కానీ తానొకటి తలిస్తే పివి వేరొకటి తలవడం కాంగ్రెస్‌లో అలవాటై పోయింది కదా!

...3 తేది ఉదయం తనను కలిసిన ఎమ్మెల్యేలతో కూడా పివి ఒక్క మాట చెప్పలేదు. సాయంత్రం ప్రకటన వెలువడింది. రానున్న ఎన్నికలలో రాష్ట్ర వ్యవహారాలను స్వయంగా చూడాలన్న పివినిర్ణయం దీని వెనుక స్ఫురిస్తున్నది. తనకు అంతరంగికుడైన వ్యక్తిని పిసిసి అధ్యక్షుడిగా పెట్టి, సమాచారం నేరుగా సేకరించి, సూత్రం త్రాడు ఢిల్లీ నుంచే లాగాలనుకున్నట్లున్నారు పివి. అభ్యర్థుల ఎంపికలోగాని, ప్రచారం తీరులో కాని, వనరుల కల్పనలో కాని తనకు తప్ప మరెవ్వరికీ ప్రమేయం వుండదని చెప్పకుండా చెప్పినట్లయింది దీనివల్ల.

రాజకీయంగా కూడా ఈ నియామకం ద్వారా మైనారిటీలను సంతృప్తి పర్చడానికి ప్రయత్నించారు ప్రధాని. కాపులను బిసి జాబితాలో చేరుస్తూ ముఖ్యమంత్రి చేసిన నిర్ణయం వల్ల ఆ వర్గాలలో కాంగ్రెస్ పట్ల వ్యతిరేకత కొంత తగ్గింది. ఆ వర్గానికే చెందిన మాజీ కేంద్ర మంత్రి శ్రీ పి. శివశంకర్‌ను సిక్కిం గవర్నర్‌గా పంపి కాపుల పట్ల తన బాధ్యత తీర్చుకున్నారు. మైనారిటీ నాయకుడికి పెత్తనం ఇవ్వడం ద్వారా వారిలో కాంగ్రెస్ పట్ల వున్న వ్యతిరేకతను తగ్గించడానికి ప్రయత్నించి నట్లయింది. కాంగ్రెస్ గెలిస్తే ఒక ముస్లిం ముఖ్యమంత్రి అవుతారన్న పరోక్ష ప్రచారంతో వారిని బుట్టలో వేసుకో గల్గుతారని అంచనా. పివి రాజకీయ చాణక్యం ముందు ఎటువంటి వాడూ బోల్తా పడవలసిందే!

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

సంఘాలతో సమావేశమై; ఆరోగ్యం పరిశుభ్రత, విద్యా కార్యక్రమాలను చర్చిస్తారు. రాత్రికి నెల్లూరులోనే మకాం. 1తేది ఉదయం 9గంటలకు రంగనాథ స్వామిని దర్శించి, కస్తూరిబా కళాక్షేత్రంలో ఫోటో ఎగ్జిబిషన్ తిలకిస్తారు. ఎన్‌జిఒ లతో మాట్లాడుతారు. సాయంత్రం తిమ్మాజ ఖండ్రిగ గ్రామం చూసి మద్రాసు వెళ్తారు

నెల్లూరు జిల్లాలోని గ్రామీణ ప్రాంతాలలో పేదలు తమ ఇళ్లలో లెట్రిన్లు కట్టించుకోవడానికి యునిసెఫ్ కోటి 50 లక్షలు విరాళంగా ఇవ్వనున్నది. కలెక్టర్ శ్రీ సాంబశివరావుగారు సాధించుకొని వచ్చిన పథకం ఇది.


జిల్లా గ్రంథాలయ సంస్థ పాత, కొత్త ఛైర్మన్లు మెట్టా చంద్రశేఖరరెడ్డి, బద్దెపూడి వేణు గోపాలరెడ్డిలను సన్మానిస్తున్న స్వాతంత్ర్య ఇంటర్నెట్ వాసు.

## జనవాణి

3వ పేజీ కొరవ

### గిన్నిస్ బుక్‌లోకి ఎక్కించ దగ్గ కాల్వ!

నెల్లూరు దర్గామిట్ట ప్రాంతంలో కెవిఆర్ పెట్రోల్ బంక్ నుండి టిటిడి కళ్యాణ మండపం వరకు గల జాతీయ రహదారిపై నాలుగైదు చోట్ల గత సంవత్సరం భారీ ఎత్తున తూముల్ని నిర్మించారు. ప్రపంచ బ్యాంకు పెట్టుబడితో ఈ పని జరిగింది. ఈ నిర్మాణాల కోసం గత సంవత్సరం కాంట్రాక్టర్లు ప్రజలకు కలిగించిన అసౌకర్యం అంతా ఇంతా కాదు. ఆ ట్రాఫిక్ బీభత్సం ప్రజలకు ఇప్పటికీ కళ్లకు కట్టినట్లే వుంది. నాగార్జున సాగర్ కుడి కాల్వ, ఎడమ కాల్వల స్థాయిలో తూములైతే కట్టారు గాని వాటికి మురుగు నీటిని పంపించే సైడు కాలువల పనిని మాత్రం ప్రపంచ బ్యాంకు కాంట్రాక్టర్లు మరిచారు. చివరికి మున్సిపాల్టీయే ఆ తంతు కాస్తా పూర్తి చేద్దామనేమో బి.కె. రెడ్డి ఇంటి సెంటర్‌లో ఓ సైడు కాలువను సృష్టించింది. ఇది అపర విశ్వామిత్ర సృష్టిలా వుంది. ప్రబంధ నాయిక నడుములా అస్తి నాస్తి విచికిత్సా హే'తువు'గా విరాజిల్లుతున్న సైడు కాలువలో మురుగు నీరు ప్రవహించి ఈ ప్రాంతంలోని ప్రతి ఇంటినీ పావనం చేస్తున్నది. ఈ కాలువ లేనప్పుడు ఇక్కడ అంతా సవ్యంగా ఉండింది. ఈ కాలువ వచ్చి అందర్నీ ఇబ్బంది పెట్టోంది. కమీషనర్ గారికి విన్నవించినా, ఏ కదలికా లేదు. ఎత్తూ లోతూ లేని, ఈ సైడు కాలువకు మోక్షం ఎవరు కల్గిస్తారు మహా ప్రభో!

-తిరుమూరు సుధాకర్ రెడ్డి
నెల్లూరు.

### ఎస్.సి.ల్లో చేర్చాలి

హరిజనులు, అరుంధతీయులతో పాటు దొమ్మరి, రజక, మంగలి కులాల వారిని షెడ్యూల్ కులాలలో చేర్చడం సమంజసం. పై మూడు కులాల వారు సంఘానికి మత బేధం లేకుండా సేవ చేస్తున్నారు. కొమ్మరి వాళ్లు నేటికీ మరుగు దొడ్లను శుభ్ర పరుస్తుంటే, రజకులు అందరి బట్టలూ ఉతికి మురికి పోగొట్టు తున్నారు. అట్లే మంగలివాళ్లు. వీళ్లు చేస్తున్న సేవను ప్రభుత్వం వెంటనే గుర్తించి షెడ్యూల్ కులాల జాబితాలో చేర్చాలి. ఈ విషయాన్ని అన్ని పార్టీల వాళ్లు సమర్థించి తీరాలి. న్యాయంగా ఆలోచిస్తే భారతదేశంలో ఆర్థిక పరమై రిజర్వేషన్ల అమలు పరచి తీరాలి. వున్నత కులాల వాస్తవ పరిస్థితి చెప్పాలంటే తిప్పరాజు సత్రం వద్ద ఎంత మంది బ్రాహ్మణులు పొట్ట కూటి కొరకు తద్దినం భోజనానికి పిలుస్తారా అని వేచి వుండడం గమనిస్తే వాస్తవ పరిస్థితి అవగత మవుతుంది. దేవాలయాలలో పూజలు చేసే బ్రాహ్మణులకు ఎంత మందికి కడుపు నిండా భోజనం, వంటి నిండా గుడ్డ వున్నదో ఆలోచించండి!

గూడూరు -ఆవుల కొండయ్య

## మండేఎండలు

-గ్రిద్దలూరు గోపాలరావు

ఓ సూర్యుడా!
ఎందుకింత కోపం?
చండశాసనుడిలా
ఎండలుమండిస్తున్నావు
నిప్పులు చెరిగిస్తున్నావు
నల్లుల్లా మాడుస్తున్నావు
త్రాగేనీరు ఎండిస్తున్నావు
పంటలను మాడ్చేస్తున్నావు
ఇది ఎండాకాలం కాదుగా
రోహిణీకార్తె కానేకాదుగా
ఇది వానలు కురవల్సినకాలం
నీకాలంగాని కాలంలోకి
ఏమిటి నీదురాక్రమణ?
నీ ఆగడం ఆపవయ్యా
వానలు కురవనీవయ్యా
ఏమిటి? ఏమంటున్నావు?
నా వాగుడు మానమంటున్నావా?
నీ మాట ఒకటి వినమంటున్నావా
నెల్లూరు నగరం లోపల
పెరుగుతున్నదంటావా, పాపం
సారా నిషేధించినా
దొంగసారా కాస్తున్నారా!
ఆకలి గొన్న ఇంజనీర్లు
ఆపురాపురని స్టీలు ,సిమెంటు
మింగుతున్నారా?
స్వార్థమే ధ్యేయంగా
కాలేజీ లెక్చరర్లు
డ్యూటీ ఎగ్గొట్టి
కాన్వెంట్లలో పనిచేస్తున్నారా!
రాజకీయదుర్గంధం
అన్నిరంగాల్లోదూరి
సర్వనాశనం చేస్తున్నదా!
ఈ స్వార్థ పిశాచాలకంతా
ఎందుకు వసతులు
కల్పించాలంటావా!
ఎందుకు వానలు
కురిపించాలంటావా!
ఎందుకు వీరినంతా
బ్రతికించాలంటావా!
కరువు సృష్టించి
నిలువునా చంపుతానంటావా!
అలాగైతే సరే !
ఈ దోపిడి వ్యవస్థలో
నీది, నిప్పులాంటి విప్లవం!
నీకో నమస్కారం!

### పి.వి. మానవత్వం

ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావు, పిసిసి అధ్యక్షుడు తులసీ దాస్ మరణ వార్త తెలియడంతోనే హుటా హుటిన హైదరాబాదుకు వచ్చి శ్రద్ధాంజలి ఘటించి వెళ్లారు. ఈ రోజుల్లో ఇంతటి మానవత్వం వుండే మనుషులు అరుదు. ఏ పదవి లేనప్పుడు కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు చనిపోయి నపుడు బెజవాడకు వచ్చి వారి దహన క్రియల్లో పాల్గొని వెళ్లారు. జై ఆంధ్రా వుద్యమంలో కాకాణి వెంకట రత్నం చనిపోతే అంత్య క్రియలకు హాజరు కావాలని పట్టు పట్టిన వ్యక్తి పి.వి. పదవులు వున్నా లేకపోయినా సంస్కారం వుండే వ్యక్తిగా ప్రధానిని అభివర్ణించ వచ్చు.

నెలూరు -టి.వి. నారాయణ

### కోవూరులో కాంగ్రెస్‌కు దిక్కెవ్వరు!

కోవూరు నియోజక వర్గంలో కాంగ్రెస్ పార్టీ తల్లి, తండ్రిలేని అనాథై పోయింది. ఉప ఎన్నికలు జరిగిన తరువాత సుబ్బరామి రెడ్డి, రామచంద్రా రెడ్డి, దేవ కుమార్ రెడ్డి ఎక్కడకు పోయారని ప్రజానీకం ఎదురు చూస్తున్నారు. సాధారణ ఎన్నికలకు ఒక్కొక్క నియోజక వర్గానికి పదుల సంఖ్యలో అభ్యర్థులు పోటీ పడుతుంటే, కోవూరు స్థానాన్ని ఏ ఒక్కరూ అడగడం లేదు. ఈ పరిస్థితికి కారణాన్ని పార్టీ గుర్తించి చక్కదిద్దే ప్రయత్నం చేసినట్లు లేదు. కోవూరు అన్ని రంగాల్లో అభివృద్ధి చెందిన ప్రాంతం. దీనిని నాయకులు అభివృద్ధి చేయనవసరం లేదు. ప్రజలలో తిరిగి వారి సమస్యలను శ్రద్ధగా ఆలకిస్తే చాలు. ఆ విధమైన ధోరణి విడనాడడం వల్లే పెళ్లకూరు రామచంద్రా రెడ్డి ఓడిపోయారు. ఉప ఎన్నికల్లో చేసిన వాగ్దానాలు మరచిన నాయకులు మళ్లీ నియోజక వర్గం ముఖమే చూడలేదు. కోవూరు ప్రజల చిరకాల కోరిక లైన డిగ్రీ కళాశాల, ఆర్టీసీ బస్ స్టేషన్, ప్రధాన రహదారి వెడల్పు చేయడం వంటి చిన్న కోరికలు తీరుస్తామన్న వాడికి, తీర్చ గలిగిన వాడికి, ఇప్పటికీ ప్రజల్లో పనిచేస్తున్న వాడికి తప్ప ఇతరులకు ఓట్లేసే రోజులు పోయాయి.

కోవూరు -శ్రీనివాసులు రెడ్డి

### ఆర్టీసీ నిర్లక్ష్యం

అతి పెద్ద రోడ్డు రవాణా సంస్థ కండక్టర్లు, డ్రైవర్లు లేరనే సాకుతో బస్సులను డిపోలలోనే వుంచడం చూస్తే నవ్వాలో, ఏడ్వాలో తెలియడం లేదు. ప్రైవేట్ ఆపరేటర్లను చూచి ఈ విషయంలో ఆర్టీసీ నేర్చుకో వలసింది ఎంతైనా వుంది. బస్సులు డిపోలలో ఆపు కొంటే రోజుకు వేల రూపాయల రాబడి పోతుంది. ప్రయాణికులకు కలిగే అసౌకర్యం వివరించి చెప్పలేము. అసలే అంతంత మాత్రంగా బస్సులు నడిచే పరిస్థితిలో సిబ్బంది కొరత వల్ల మరిన్నిటిని నిల్పి వేసే బదులు కొంత మంది టెంపరరి సిబ్బందిని నియమించు కొంటే మంచిది.

నెల్లూరు -ఆర్.వి. భూషణం

# దాసరి, కృష్ణారెడ్డి పౌరాణికచిత్ర సమరం!

పౌరాణికం ప్లస్ సాంఘికం కురుక్షేత్రం సన్నివేశా లుంటాయి అని ఎస్.వి. కృష్ణారెడ్డి-

"కె.వి. రెడ్డికి అంకిత మిస్తాం. సంక్రాంతికి విడుదల" అని దాసరి-

"రెండు కోట్ల బడ్జెట్" అని ఒకాయన.

"మా చిత్రం మూడు మూడున్నర కోట్లు దాటుతుంది" అని ఈయన!

ఇదీ వరస. ఘటోత్కచుడి పాత్రను ఎన్.టి.ఆర్., ఎస్.వి. రంగారావు, సత్యనారాయణ తప్ప మరెవ్వరూ చేయలేరని ఎస్.వి. కృష్ణారెడ్డి వ్యాఖ్యానించినప్పుడే దాసరిలో వేడి పుట్టుకొచ్చింది. తాను

తీయబోయే 'మాయాబజార్' లో ఘటోత్కచుడు తానే గనుక. తాను ఇంత కాలంగా సంపాదించిన పేరును ఎస్.వి. కృష్ణారెడ్డి కొద్ది కాలంలోనే సంపాదించడ మేమిటని దాసరి కడుపుమంట. మొత్తం మీద ఇద్దరూ గోదాలోకి దూకారు. దాసరి 'మాయాబజారు' చిత్రానికి ఇటీవల పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం చేశారు. ఇందులో ఆయనతో పాటు అభినవ కృష్ణుడుగా అక్కినేని నాగేశ్వర రావు, సుమన్, ఆమని, మోహన్ బాబు నటిస్తున్నారు. ఒక ప్రత్యేక సన్నివేశంలో నాగార్జున కన్పిస్తారు. ఎస్.వి. కృష్ణారెడ్డి "ఘటోత్కచుడు" చిత్రంలో సత్యనారాయణ, అలీ, రోజా, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, తనికెళ్ళ భరణి, ఎ.వి.ఎస్, మల్లికార్జున రావు, గుండు హనుమంత రావు ఆదిగా గల వారు పాల్గొంటారు.

"మాయాబజార్" అక్టోబర్ 8 న; "ఘటోత్కచుడు" అక్టోబర్ 24 న సెట్స్‌కు వెళ్తాయి.

> కోట్లు ఖర్చు పెట్టి ఇద్దరు దర్శకులు కుస్తీ పడుతున్నారు; ఎవరిది గెలుపో నిర్ణయించేది ప్రేక్షకులే!

ఈ తమాషా ఏమిటో చూద్దామని చిత్ర పరిశ్రమలోని పలువురు ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నారు.. పరిశ్రమ మనుగడ దృష్ట్యా ఈ పోటీ నుంచి ఇద్దరిలో ఎవరో ఒకరిని విరమింప చేయడం ఇంత తేలికైన విషయం కాదు. ఇద్దరూ సై అంటూ ముందంజ వేస్తున్నారు. ఎవరి బలాలు వారివి. జయాపజయాలు ప్రేక్షకుల అధీనాలు.

## "హిట్ అవుతుందని చెప్పను!"

"నేను ప్రధాన పాత్ర పోషించి హిట్ చేస్తాను" అన్నారు కాస్ట్యూమ్ కృష్ణ.

"తప్పకుండా 'పోకిరిరాజా' మంచి చిత్రమవుతుంది" అన్నారు డైరక్టర్ ఎ. కోదండ రామిరెడ్డి.

"ఇది సూపర్ హిట్ అయి తీరుతుంది" అన్నారు దర్శకుడు గెద్దాడ ఆనంద బాబు.

ఇలా 'ప్రెస్‌మీట్' లలో దర్శక, నిర్మాతలు గొప్పలుచెప్పడం మామూలు. గతంలో మోహన్‌బాబు విడుదలకు ముందు తన ప్రతి చిత్రం గురించీ ఇలాగే ప్రకటించేవారు. చివరికి ఆయనే తగ్గి, కొన్ని ప్రేక్షకులకు నచ్చలేదు. అందుకే ఇక నుంచి నేను నటించే ఏ చిత్రానికి కూడా ముందే హిట్ అవుతుందని ప్రకటించ దలచు కోలేదు" అన్నారు- 'ఎం.ధర్మారాజు, ఎం.ఎ.'

కొరవ 10 పేజీలో



చట్టానికి మరోవైపు చిత్రంలో అభిలాష

# అక్కినేని ఆదర్శం

సినిమా హీరోగా 50, రంగస్థల నటుడుగా 60, నిజ జీవితంలో 70 వసంతాలు పూర్తిచేసుకుని 71 వ ఏట ప్రవేశించిన ఎ.ఎన్.ఆర్.కు ఇటీవల విశాఖ పట్టణంలో వివిధ చిత్రాలలో ఆయనతో కలిసి నటించిన కథా నాయికలందరూ జరిపిన పుష్పాభిషేక మహోత్సవం చలన చిత్ర చరిత్ర పుటల్లో నిలిచి పోతుంది. రానున్న నాలుగు సంవత్సరాల లోపున పాతిక లక్షలు సేకరించి, ఆ నిధి నుండి ప్రతి ఏటా వివిధ రంగాలలోని నిష్ణాతులకు ఒక లక్ష రూపాయల బహుమతి అంద జేయ బడుతుందని, ఈ అక్కినేని ఇంటర్నేషనల్ ఫౌండేషన్ నుంచి ప్రజాహిత కార్యక్రమాలకు కూడా విరాళం ఇవ్వబడు తుందనీ, ఇది తన తదనంతరం కూడా కొనసాగుతుందని ఎ.ఎన్.ఆర్. ప్రకటించడం ఎంతైనా ప్రశంస నీయం.



ఆంధ్రజ్యోతి సబ్ ఎడిటర్ రమణయ్య మనుమరాలు, రవీంద్రనాథ్ కుమార్తె గాయత్రి, సురేష్‌బాబు. వీరి పెండ్లి ఇటీవల నెల్లూరులో జరిగింది.

## నెల్లూరు సంగతులు

4వ పేజీ తరువాయి

అక్కినేని నాగేశ్వర రావు 71వ జన్మదినోత్సవ వేడుకలు ఇందిరా భవన్‌లో 22 తేది జరిగాయి. పాటల పోటీలను మాజీ కౌన్సిలర్ పత్తి రవీంద్ర బాబు, నృత్య పోటీలను పసుపులేటి విజయ కుమార్ నాయుడు ప్రారంభించారు. సాయంత్రం జరిగిన బహుమతి ప్రదానోత్సవ సభకు రొటేరియన్ కొండా బలరామరెడ్డి అధ్యక్షత వహించి అక్కినేని సాధించిన సినీ విజయాలను వివరించారు. బాలాజీ గ్రూప్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ పి.వి. ప్రసన్న రెడ్డి విజేతలకు బహుమతు లందజేశారు. సినిమా పాటల పోటీల జూనియర్ విభాగంలో కె. లోహిత, ఎన్. ఉదయ దీప్తి, ఆ. దీప్తి విజేతలుగా నిలిచారు. జానపద సంగీతంలో టి. చంద్రశేఖర రెడ్డి, సి. వినయ కుమార్, సి. హర్షప్రియ, లలిత సంగీతంలో బి. పద్మావతి, పి. భాగ్యలక్ష్మి, సి. నాగేశ్వర రావు, వరుస స్థానాలు పొందారు. గ్రూప్ డ్యాన్స్‌లో ముంతాజ్ అండ్ పార్టీ, ఎన్. బాబు పార్టీ, కళారవి పార్టీ ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు సాధించారు. బ్రేక్ డాన్స్‌లో ఎన్. శేఖర బాబు, టి. రాజేష్, ఎన్.సి. శివ ప్రసాద్ విజేతలయ్యారు. చివరన సంస్థ కార్యదర్శి ఎం.డి. బజాని వందనాలు చెప్పారు.



### నెల్లూరు సబ్‌కోర్టులో

SCS.422 of 1993

Syndicate Bank. Dargamitta Baranch, Nellore, represented by its Manager -వాది

Vs

2. షేక్ మహబూబ్ బాషా వగైరా

2వ ప్రతివాది తండ్రి కాశింసాహెబ్ -ప్రతివాదులు

సాకిన్ - నేతాజీ నగరు, పొదలకూరు రోడ్డు, నెల్లూరు.

ఈ నంబరున వాది దావా మొత్తము దరిమిల్లా వడ్డీ ఖర్చుల తోటి రాబట్టు కొనుటకుగాను దావాదాఖలు చేసుకొన్నందులకు 2 వ ప్రతివాదికి దావా నోటీసు నిమిత్తం 20-10-94 తేది వాయి[illegible] వేయబడి యున్నది. కావున ఆనాడు పగలు 10 గంటలకు సదరు ప్రతివాది కోర్టుకు హాజరయి యిదైనా ఆక్షేపణలున్న యెడల తెలుప కొనవలయును. లేని యెడల పరోక్షమున తీర్మానించ బడును.

కె. బుజ్జిరెడ్డి
వాది అడ్వకేటు

### కళామందిర్ పోటీల్లో విజేతలు

కళామందిర్ కల్చరల్ అసోసియేషన్ తన 134 వ సాంస్కృతిక కార్యక్రమాన్ని 22 తేది. టౌన్‌హాల్‌లో ఘనంగా జరిపింది. నృత్య, సంగీత, ఏక పాత్రాభినయాల పోటీలకు రాష్ట్రం నలుమూలల నుండి కళాకారులు వచ్చి పాల్గొన్నారు. నెల్లూరుకు చెందిన కె. ఉదయ భాస్కర్ చాణక్య పాత్రను ప్రతిభా వంతంగా పోషించి ప్రథమ బహుమతి పొందగా, రాపూరుకు చెందిన టి. వెంకటేశ్వర రావు సత్యహరిశ్చంద్ర, కడప జిల్లాకు చెందిన ఎం. మనోహర్ శకుని పాత్ర పోషించి ద్వితీయ, తృతీయ బహుమతులు పొందారు. సినిమా సంగీతంలో సి. కృష్ణారెడ్డి, జి. లత, జి. ప్రభాకర్ వరుస స్థానాలు పొందారు. జానపద సంగీతంలో అరుణ్, విజయ కుమార్, బి. జ్యోతిబాసు, పి.డి.ఆర్. ప్రసాద్‌లు గెలు పొందారు. నెల్లూరు ఆర్టీవో జయకుమార్ రెడ్డి విజేతలకు బహుమతు లందించారు. గ్రంథాలయ సంస్థ ఛైర్మన్ మెట్టా చంద్రశేఖర రెడ్డి, రచయిత వాకాటి పెంచల రెడ్డిలను కళామందిర్ సంస్థ వ్యవస్థాపకుడు బి. దాశరథి సన్మానించారు.

### శ్రీనాథ జయంతి సభ

వర్ధమాన సమాజ అధ్వర్యాన 2 తేది టౌన్ హాల్‌లో శ్రీనాథ జయంతి సభ జరుగుతుంది. అనంతపూర్ శ్రీ కృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ డాక్టర్ శలాక రఘునాథ శర్మ 'శ్రీనాథుని కవిసార్వభౌమత్వం' అంశం పై ఉపన్యసిస్తారు. అనంతరం శ్రీమతి పొలంరెడ్డి యశోధర స్మృత్యంకంగా శ్రీ పి. నరేంద్ర రెడ్డి ఇచ్చే సన్మానాన్ని స్వీకరిస్తారని సమాజం కార్యదర్శి బి.వి. నరసింహం చెప్పారు.

### సాయితేజ క్రియేషన్స్ వార్షికోత్సవం

ఔత్సాహిక యువ దర్శకుడు అళహరి ప్రారంభించిన సాయి తేజ క్రియేషన్స్ నిర్మాణ సంస్థ 22 తేది ప్రథమ వార్షికోత్సవాన్ని జరుపు కొన్నది. కార్యక్రమానికి అధ్యక్షత వహించిన నవలా రచయిత శైలకుమార్ మాట్లాడుతూ ఎన్నో నిర్మాణ సంస్థలు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నా, ఉదాత్తంగా విజయ వంతంగా సంస్థను నిర్వహిస్తున్న అళహరిని అభినందించారు. తమ సంస్థ ఇప్పటి వరకు లవ్ గేమ్ వీడియో చిత్రం, ఆశ్రమం టెలి ఫిలిం నిర్మించిందని, నవంబర్ మూడవ వారంలో 'ఫైటింగ్ మాస్టర్స్' టెలిఫ్లే షూటింగ్ ప్రారంభిస్తుందని నిర్వాహకుడు అళహరి తెలిపారు. సినీ దర్శకుడు సునీల్ వర్మ తాను నిర్మించే తదుపరి చిత్రం 'హల్లో లవర్స్'లో సాయితేజ క్రియేషన్స్ సభ్యులకు అవకాశ మిస్తానని హామీ ఇచ్చారు. కార్యక్రమంలో మహిళా కాంగ్రెస్ నాయకురాలు బి.వి. లక్ష్మి, లయన్ ఎస్.ఎస్.వి. రామ్మోహన రావు, షేక్ ఇస్మాయిల్, సుచిత్ర తదితరులు పాల్గొన్నారు.

### ప్రత్యేక ఉపాధ్యాయుల సమస్యలు న్యాయమైనవే!

ప్రత్యేక ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న సమస్యల పై సదస్సు 25 తేది టౌన్‌హాల్‌లో జరిగింది. జిల్లా విద్యా శాఖాధికారి పి. భీమన్న, జిల్లా ప్రజా పరిషత్ ఛైర్మన్ డేగా నారసింహా రెడ్డి, గూడూరు మాజీ మండలాధ్యక్షుడు సిహెచ్ విజయమోహన్ రెడ్డి ముఖ్య అతిథులుగా హాజరయ్యారు. జిల్లా విద్యా శాఖాధి కారి భీమన్న మాట్లాడుతూ ప్రత్యేక ఉపాధ్యాయ సమస్యలు న్యాయమైనవని, వారు పని చేసిన కాలాన్ని రెగ్యులర్ సర్వీసు చేయడం, అడ్వాన్సు స్కేలుకు వర్తింప చేయమని కోరడం భావ్యమన్నారు. డేగా నారసింహా రెడ్డి మాట్లాడుతూ 84 నుండి ఐదు సంవత్సరాల వరకు కేవలం 398 రూపాయల వేతనంతో పని చేయడం చాలా కష్టమని, ఆ కాలానికి తప్పక గుర్తింపు నివ్వాలని కోరారు. 500 మంది ప్రత్యేకోపాధ్యాయులు పాల్గొన్న సదస్సు[illegible] కె. గాలయ్య, యు.టి.ఎఫ్ ప్రధాన కార్యదర్శి బాబురెడ్డి, కమిటీ కన్వీనర్ ఎస్.కె. నజీర్ భాషా తదితరులు పాల్గొన్నారు.

### ఎలుకల్లారా! వెళ్ళిపోండి!

-జయంపుకృష్ణ

అంతరించిందనుకున్న ప్రమాదం
ముంచుకొచ్చింది వికృతమై విషాదం
అప్పుడెప్పుడో అట్టుడికించిన ప్లేగు
తిరిగి జడలు విరబోసుకుంది రాక్షసిలాగా
పర్యావరణ కాలుష్యం దీనికి కారణమా?
అదను చూచి వైరస్‌క్రిమి అప్రకటిత రణమా??
నిజానికి ఈ వ్యాధి ఎయిడ్స్ కన్నా స్పీడ్
ఒకేసారి ఎన్నిచాపులో ఓమై గాడ్ !!-
అందుకు కారణమైన తల్లుల్లారా తరలిపోండి!
మానుండి ఓ ఎలుకల్లారా వెళ్ళిపోండి!-
మీరు లేకుంటే, రాకుంటే ప్లేగు లేదు, రాదు
మీరు చావకూడదు, మమ్ము చంపకూడదు
మీరు మామధ్య తిరగొద్దు, కరవద్దు ; పొండి
అనంత దూర తీరాలకు వెళ్ళిపోండి-

## సినిమా

9వ పేజీ తరువాయి

షూటింగప్పుడు! ఈ విషయాన్ని ఇతర దర్శక నిర్మాతలు కూడా గుర్తిస్తే ఎంత బాగుంటుందో!

### సుమన్ సరసన శ్రీదేవి చెల్లెలు

దాదాపు 20 ఏళ్లుగా నెల్లూరులోని విఘ్నేశ్వర పిక్చర్స్ నడుపుతున్న డి.వై.ఎం. రావు ఎన్నో చిత్రాలు పంపిణీ చేసిన అనుభవంతో, చిత్ర నిర్మాణ రంగంలో ప్రవేశించారు. సిద్ధి వినాయక పిక్చర్స్ పతాకంలో ఈయన నిర్మిస్తున్న చిత్రంలో సుమన్ సరసన రంభ, శ్రీదేవి పినతల్లి కూతురు మహేశ్వరి నటిస్తున్నారు. దర్శకత్వం: బి. గోపాల్.

### అక్టోబర్ 3 నుంచి చిత్రీకరణకు బ్రేక్

ఎవరు పుణ్యం కట్టుకున్నారో, దీని వల్ల ఎవరికి ఏం జరుగు తుందో గాని, హైదరాబాద్‌లో చిత్ర పరిశ్రమ కొన్ని గ్రూపులుగా విడి పోవడానికి ఒక శుభముహూర్తాన అంకురార్పణ జరిగింది. అక్టోబర్ 3 నుంచి ఆంధ్ర ప్రదేశ్ అంతటా 'మా' సమాఖ్యలోని 24 కార్మిక సంఘాల సభ్యులైన నటులు, సాంకేతిక నిపుణులు, కార్మికులు తమ సమస్యలు పరిష్కారం అయ్యే వరకు నిరవధికంగా షూటింగ్‌లో పాల్గొనరని మద్రాస్ ఫిలిమ్ ఫెడరేషన్ అధ్యక్షుడు, కార్యదర్శి తెలిపారు. సెప్టెంబర్ 14 న చిత్ర కార్మికులకు గృహ వసతి కల్పించే స్థలానికి హైదరాబాద్‌లో ముఖ్యమంత్రి శంకుస్థాపన చేసినప్పుడే తమ సంస్థ వేరు అనీ, తాము 'మా' సభ్యులతో కలిసి పని చేయమని ఆంధ్ర ప్రదేశ్ ఫిలిం ఎంప్లాయిస్ ఫెడరేషన్ కార్యదర్శి చేసిన ప్రతిజ్ఞ మా సభ్యులను బాధించింది. అసలు ఏడేళ్ల క్రితం హైదరాబాద్‌లో చిత్ర పరిశ్రమ కార్మిక సంఘాలు లేవు. అందరూ మద్రాసు నుంచి వెళ్లిన వారే. మూడేళ్ల క్రితమే అక్కడ ఫిలిం ఎంప్లాయిస్ ఫెడరేషన్ ఉద్భవించింది. ఈ సభ్యులకే గృహవసతి ఇవ్వాలని, ఇతరులకు ఇవ్వకూడదు అని అనడానికి వీళ్లెవరు? అందుకే ఈ పోరాటం'' అని 'మా' సమాఖ్య పోరాటం ప్రారంభించింది. ఉభయుల బలా బలాలు త్వరలో తెలుతాయి.

### కొన్ని చిత్రాల పేర్లు

కె. రాఘవేంద్ర రావు దర్శకత్వంలో రాజశేఖర్ హీరోగా నటించే సుజయ మూవీస్ చిత్రం ''హాయ్ హాయ్ చిన్న రాజా'' ''ఎర్రసైన్యం'' నారాయణ మూర్తి తాజా చిత్రం ''ఖబడ్దార్'', గీతా కృష్ణ చిత్రం ''సర్వర్ సుందరం గారి అబ్బాయి'', కృష్ణ హీరోగా కోరుకొండ వరహాల రాజా నిర్మించే చిత్రం ''డిక్టేటర్''.

### కొత్త స్టూడియోలు

నటి మీనా మద్రాసు సమీపంగా స్టూడియో నిర్మించ డానికి స్థలం కొన్నది.

హైదరాబాద్ ఫిలిమ్ నగర్ దగ్గర్లోనే పది ఎకరాలు కేటాయించమని మనీషా సంస్థ ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకుంది. ''వెయ్యి ఎకరాల్లో ఉండే సదుపాయాలన్నీ ఆ పది ఎకరాలలోనే చూపిస్తాం. స్టూడియో అద్దె కూడా చాలా తక్కువగా ఉంటుంది'' అన్నారు దర్శకుడు ఎస్వీ కృష్ణారెడ్డి.

### ఎస్. గోపాల్ రెడ్డి చిత్రం ''మాతో పెట్టుకోకు''

''అక్టోబర్ 14 న అభిమానుల సమక్షంలో మద్రాసులోని జయలలిత ఫిలిమ్ సిటీలో షూటింగ్ మొదలెడుతున్నాం'' అన్నారు భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత ఎస్. గోపాలరెడ్డి. ఈయన నిర్మించే ''మాతో పెట్టుకోకు'' చిత్రంలో బాలకృష్ణ, రోజా, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, ఎ.వి.ఎస్., మల్లికార్జున రావు ఆదిగా గలవారు పాల్గొంటారు. మాటలు: గణేశ్ పాత్రో, సంగీతం: రాజ్-కోటి. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ఇ.వి.వి. సత్యనారాయణ. ఎక్కువ టాక్స్ చెల్లించ డానికి సిద్ధపడే మద్రాసు ప్రాంతాలలోనే షూటింగ్ పెట్టుకున్నాం. ఆ ఎక్కువ టాక్స్ మన రాష్ట్రంలో బడుగు వర్గాలకు ఉపయోగ పడాలి. ఇలా నేను పరోక్షంగా మన రాష్ట్ర ప్రజలకు తోడ్పడు తున్నందుకు ఎంతో ఆనందంగా ఉంది'' అన్నారు గోపాల రెడ్డి.

జిల్లావార్తలు

# సిరమిక్ ఇన్‌స్టిట్యూట్ తరలింపు సిగ్గుచేటు!

ప్రాంతీయ భేదాలు బాగా ప్రబలడంతో రాష్ట్రానికంతటికీ బాధ్యత వహించాల్సిన మంత్రులు సైతం స్వార్థ బుద్ధితో ప్రజోపయోగ పథకాలను తమ నియోజక వర్గాలకు తరలింప జేయాలనుకోవడం అన్యాయం, అక్రమం. అటువంటిదే గూడూరు సిరామిక్ ఇన్‌స్టిట్యూట్‌ను విజయవాడకు తరలింపు రంగం సిద్ధమవుతుంతడం. ఆంధ్ర, తమిళనాడు రాష్ట్రాలు ఉమ్మడిగా వున్నప్పుడు 1939 సంవత్సరంలో మద్రాసు ఎగ్మూర్ వద్దనున్న సిరామిక్ ఇన్‌స్టిట్యూట్‌ను 1952లో గూడూరుకు తరలించారు. ఆ కాలంలో ఈ ప్రాంతంలో 200 లకు పైగా సిలికాగని పరిశ్రమలు ఉండేవి. సిరామిక్ వెలికితీత ఇప్పటికి నెల్లూరు జిల్లా నుండే జరుగుతుంది. ఈ నేపథ్యంలోనే రాష్ట్ర ప్రభుత్వం 1969లో ఈ ఇన్‌స్టిట్యూట్‌కు టెక్నికల్ బోర్డు గుర్తింపు కూడా ఇచ్చింది. అప్పటి నుండి 250మంది విద్యార్థులు ఇక్కడ విద్యనభ్యసించే వీలు కలిగింది. రాష్ట్రం మొత్తం మీద ఇటువంటి ఇన్‌స్టిట్యూట్ గూడూరులోనే వుంది. దీని అభివృద్ధికి 1992సంవత్సరంలో నిధులు మంజూరైనా కుంటిసాకులతో భవన నిర్మాణాలు ఆపేశారు. దీనికంతటికీ ప్రిన్సిపాలే కారణమన్న ప్రచారం ఒకటి వుంది. ఆయన విజయవాడ వాస్తవ్యుడు కావడం, సంబంధిత శాఖా మంత్రి ఎంకె బేగ్ కూడా ఆ నియోజక వర్గానికి చెందడం వల్ల ఈ ఇన్‌స్టిట్యూట్‌ను గూడూరు నుండి తరలించాలన్న ఆలోచనలో వున్నారట. ఈనెల 16 వ తేదీ తిరుపతి నుండి విజయవాడకు పోయే మంత్రి గంటసేపు గూడూరు గెస్ట్‌హౌస్‌లో బసచేస్తే, ఇన్‌స్టిట్యూట్‌ను విజయవాడకు తరలించమని ప్రిన్సిపాల్ విద్యార్థులచేత వినతి పత్రాలు ఇప్పించారట. మంత్రిగారు, మెహర్బానికి స్వంత నియోజవర్గంపై మక్కువతో తరలింపుకు పూనుకొంటే పదవికే కళంకం తెచ్చిన వారవుతారు. అయినా ఘనత వహించిన గూడూరు నాయకులు ఈ విషయంలో మెదలకుండా గమ్మున ఎలా వున్నారో అర్థంకావడంలేదు.

### ప్రయాణీకులను దోచుకుంటున్న ఆర్టీసి

ప్రయాణీకులకు సౌకర్యాలు కల్పించడంలో అమడ దూరంలో వుండే ఆర్టీసి అధికారులు ఏదోవంకతో వారిని దోచుకోను మాత్రం ముందుంటారు. దీనికి వుదాహరణగా గూడూరు డిపో నెల్లూరు వరకు నడుపుతున్న నాన్‌స్టాప్ అశ్విని బస్సులను చెప్పవచ్చు. గూడూరు నుండి నెల్లూరుకు ఆర్డినరీ బస్సుల ఛార్జి 5.50 రూపాయలైతే, ఎక్స్‌ప్రెస్ ఛార్జి 7.50నుండి 9 రూపాయల వరకుంది. అయితే కొత్తగా ప్రవేశ పెట్టిన అశ్విని బస్సులలో 10 రూపాయలు వసూలు చేస్తున్నా ప్రయోజనం లేకుండా పోయింది. ఈ బస్సు ఒన్‌మాన్ సర్వీసు కావడంతో కండక్టరు వుండడు. డ్రైవరే ఊరి వెలుపల బస్సు ఆపి టికెట్లు కొట్టేసరికి ఇరవై నిమిషాలు పడుతుంది. సగం సమయం దీనికే సరిపోతుంది. ఇతర సర్వీసులు తక్కువ ఛార్జి, తక్కువ సమయంలో గమ్యం చేర్చుతుండగా ఎక్కువ ఛార్జి వసూలు చేస్తూ లేటుగా చేరుస్తు, ప్రయాణీకుల సహనాన్ని పరీక్షిస్తున్నాయి. అశ్విని అని పేరు పెట్టి తెల్లరంగు కొట్టి, అదనపు ఛార్జి వసూలు చేస్తే సరిపోతుందా? అని అధికారు ఆలోచించి తగు నిర్ణయం తీసుకుంటే మంచిది.

### ఎమ్మెల్యేగారి మాటకు విలువ లేదు

రాపూరు నియోజకవర్గం పరిధిలోని కందల పేరు గ్రామస్తులు పక్కా గృహాలకై ఎమ్మెల్యేగారి సిఫార్సులో పెట్టుకొన్న వినతి పత్రానికి కదలిక లేక పోయింది. దీంతో ఏమి చేయాలో పాలుపోని స్థితిలో గ్రామస్తులున్నారు. గ్రామానికి చెందిన 65 మంది వెనుక బడిన తరగతుల కుటుంబీకులు గృహ నిర్మాణ సంస్థ ద్వారా పక్కా గృహాలు నిర్మించు కొనేందుకు సహాయ పడమని బంగోలు ఎమ్మెల్యేకి సమర్పించారు. [illegible] 28 మంది గృహాల మంజూరుకు [illegible] కట్టారు.

కొరవ 12 పేజీలో


జిల్లా గ్రిగ్ ఆటల పోటీలలో [illegible] పోటీలలో మొదటి బహుమతి గెల్చుకున్న [illegible] విద్యార్థినులు, [illegible]

### బైట్లర్‌ను మైమరపిస్తుందేది...

# రాజకీయమా? బైపాస్ టోల్‌గేట్ కోసమా?

కన్పించడం లేదు. జనార్ధన రెడ్డికి వ్యతిరేకంగా రాజకీయ బలాన్ని సమీకరించాలన్నది ఆయన సంకల్పం. కాని ఒక్క జానకిరాం తప్ప జనార్ధన రెడ్డి అనుచరు లెవ్వరూ అటువైపు కన్నెత్తి చూడడం లేదు. జానకిరాం ఉభయ చరుడు; నేల మీద, నీళ్లలో అవసరాన్ని బట్టి జీవించగల నేర్పు వుంది. ఉదయగిరిలో మాగుంట వారి అవసరం ఆయనకు వ్యక్తిగతంగా కూడా వుంది. పెళ్లకూరు రామచంద్రా రెడ్డి వర్గాలకు అతీతుడు; పిఏ ఎటు చెప్తే అటు వెళ్లడం తప్ప, స్వతంత్రించి నిర్ణయాలు తీసుకోడు. వేమారెడ్డి రామచంద్రా రెడ్డి చతురుడు; అంత సులువుగా లొంగే ఘటం కాదు; అంతరంలో ఆయన జనార్ధనరెడ్డిని విస్మరించే ప్రసక్తే రాదు; పిల్చి పూలమాల వేస్తానంటె వద్దనడు. జా. విష్ణు ఎప్పుడూ జనార్ధన రెడ్డి విహితులు కాదు. ఇంకెవ్వరిని లాగుకోగల్గుతారు ఈ సభతో!

రేపటి టికెట్ల పంపిణీకి ఇదేమైనా వుపయోగ పడుతుందా అంటే అదీ లేదు. టికెట్ల నిర్ణయంలో పాల్గొనే తాహతు బైట్లర్‌కు లేదు. దరఖాస్తులు, ధాంధూలు ఏవి పట్టించుకోడు. ఇంత ఆగం చేసి, ఇందరు మంత్రులను పట్టి, బలవంతాన పంపించి నందుకు జిల్లాలో జనార్ధనరెడ్డి వర్గాన్ని బలహీనం చేసినట్లు నిరూపించ గల్గితే

## ధనదర్ప ప్రదర్శన

(5 పేజీ కొరవ)

ముఖ్యమంత్రి సంతోషించి, ఏదైనా సహాయ పడి వుండే వాడు. కాని లారీలలో జనాన్ని తెచ్చి బ్రహ్మాండమైన సభ జరిపించా మంటె మురిసి పోతాడా? అసలే మాగుంట సుబ్బరామ రెడ్డి సిఫార్సు మీద పెంచలకోన దేవస్థాన ధర్మకర్తలను నియమిస్తే, వారు ప్రక్క రోజే పార్టీ ఫిరాయించి పరువు తీశారని మండి పడుతున్నాడాయన. జనార్ధన రెడ్డిని కష్టపెట్టి మంత్రులను నెల్లూరుకు పంపి ప్రయోజనం సమకూర లేదంటె ఎట్లా ప్రతిస్పందిస్తాడో వూహించుకోవచ్చు.

కేవలం ధన ప్రదర్శనకు తప్ప, బల ప్రదర్శనకు వుపయోగ పడని ఈ ఆడంబరం. ఈ లక్షల ఖర్చు ఎందుకు? సుబ్బరామ రెడ్డి గారు ఆత్మ పరిశీలన చేసుకోవాలి!

## జిల్లావార్తలు

11వ పేజీ కొరవ

ఎమ్మెల్యే గారి సిఫార్సు వుత్తరంతో జూలైలో కలెక్టర్‌కు వినతి పత్రం కూడా సమర్పించారు. కాని ఎందరికో గృహాలు మంజూరైన ఇంతవరకు తమకు ఆ భాగ్యం రాలేదని గ్రామస్తులు వాపోతున్నారు. అదే విధంగా ఎంతో కాలంగా సమస్యగా వున్న రోడ్డు విషయమై కూడా ఎమ్మెల్యేగారు కలెక్టర్‌కు సిఫార్సు చేయడం ఆయన ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకు పంపడం ఆ పని అడుగు కూడా ముందుకు కదలక ఆగిపోయి వుందట. వర్షాకాలంలో రోడ్డు వేయకుంటే రాని బస్సును తలచుకొని గ్రామస్తులు ఆవేదన చెందుతున్నారు. రాపూరు నియోజక వర్గ సమస్యల పరిష్కారానికి కృషిచేస్తానని చెప్పివున్న ఎం.పి.గారు గ్రామస్తుల సమస్యల తీర్పును చొరవ చూపించ వలసిన అవసరం ఎంతైనా వుంది.

### రాపూరులో విచ్చల విడిగా వ్యభిచారం

రాపూరులో ఇటీవల వ్యభిచారం జోరందుకుంది. అరికట్టె నాధుడు లేకపోవడం అడ్డు-అపులేకుండా సాగుతుంది. ప్రక్కనే వున్న కడప జిల్లాచిట్వేల్, కోడూరు, రాజంపేటలకు ప్రతిరోజూ వ్యభిచారిణులు రాపూరు ఆర్టీసి బస్టాండ్‌కు చేరుకొని విటులను ఆకర్షిస్తున్నారు. మరికొంత మంది తిక్కన వాటిక పార్కు, ఈదల చెర్వు, అగ్రత్తకట్ట, మద్దెలమడుగు ప్రాంతాలను కేంద్రాలుగా చేసుకొని తమ వ్యాపారాన్ని కొనసాగిస్తున్నారు. బస్టాండ్‌లో వ్యభిచారం న్యూసెన్సుగా మారింది. సంసారపు మహిళలు బస్టాండుకు పోవడం • సమస్యగా తయారైంది. స్థానిక పోలీసులు మామూళ్లకు అలవాటు పడిపోయి వున్నట్లుంది. వున్నతాధికారులు ఎవరైనా ఆస్థితిని చక్కదిద్దితే రాపూరు ప్రజలు సంతోషిస్తారు.

### గూడూరులో మేడసాని అష్టావధానం

గూడూరు రోటరీ క్లబ్ ఆధ్వర్యంలో డి.ఎస్.ఆర్ కమ్యూనిటీ హాలులో ఈనెల 26 తేది జరిగిన మేడసాని మోహన్ అష్టావధాన కార్యక్రమం జనరంజకంగా జరిగింది. కార్యక్రమాన్ని క్లబ్ అధ్యక్షురాలు దేవకి భాస్కరరెడ్డి ప్రారంభించగా, అను సంధాన కర్తగా డి.ఆర్. డబ్ల్యూ కళాశాల ప్రిన్సిపాల్ మెహర్‌మణి వ్యవహరించారు. పృచ్ఛకులు బి. రంగాచార్యులు, డాక్టర్ కె.సీతారామయ్య, బి. జ్వాలరామశర్మ, కె.ధనలక్ష్మి, డాక్టర్ బి.సుబ్రహ్మణ్యం, సయ్యద్ సాదిక్, వి.వెంకటేశ్వర్లు , వెకంటసుబ్బయ్య గార్ల ప్రశ్నలు అవధాని ప్రజ్ఞాపాటవాలముందు వెలవెలబోయాయి.





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,